# చందమామ

# మన సంస్కృతిని తెలుసుకోండి పోటీ

రూ. 100,000 పైగా విలువగల బహుమతులు నెగ్గండి!

గొప్ప బహుమతి:

"ఇండియన్ పనోరమా". 2 పెద్దలకి మరియు 2 పిల్లలకి అన్ని ఖర్చులు చెల్లించే ఆటవిడుపు లేక దానితో సమానమైన రొక్కం రూ. 25,000

**రెండవ ...మతులు**

...ాషలోను 10)
...ి యస్‌యల్ఆర్ సైకిల్ లేక ...ుంటి క్వార్ట్జ్ వాచ్ లేక దానితో ...మైన రొక్కం రూ 600

**300 మూడవ బహుమతులు**

(ప్రతి భాషలోను 25)
క్రూయిసర్ పెన్ సెట్ లేక ఎవరెడి కమాండర్ టార్చ్ లేక కామిలిన్ పెయింటింగ్ సెట్

**1200 కన్సొలేషన్ బహుమతులు**

(ప్రతి భాషలోను 100)
చందమామకి ఒక సంవత్సరం ఉచిత చందా

**1200 'స్పాట్' బహుమతులు**

(ప్రతి భాషలోనూ 100)
ప్రతిభాషలోనూ వచ్చిన మొదటి 100 కరెక్ట్ ఎంట్రీలకి అద్భుతమైన కానుక

## ... నెగ్గాలి:

...చందమామ మీకోసం వినోదంతో పాల్గొని సులభంగా ...పోటీ నిర్వహిస్తోంది. ఈ క్రింద చూపించిన పాత్రలన్నీ ...ుు పురాణాలలోని ప్రసిద్ధి చెందిన పాత్రలే. ఇప్పుడు ...లకు సరియైన పేర్లను జతపర్చాలి. అంతే. ఆ తర్వాత ... చందమామ అంటే ఇష్టం. ఎందుకంటే..." అనే వాక్యం ...యండి. మీ ఎంట్రీని పోటీ కూపన్‌తో (ఏప్రిల్, మే 1983 ...ామ సంచికలలోమాత్రమే లభిస్తుంది) మాకు పోస్ట్‌చేయండి. ...ుకోండి, ప్రవేశరుసుంలేదు! ఒకరు ఎన్ని ఎంట్రీలయినా ...చ్చు! కాని ప్రతి ఎంట్రీతోనూ ఒక పోటీ కూపన్ ...చివుండాలి.

## పోటీ నియమాలు & నిబంధనలు

1. అధికార ప్రవేశపత్రం మీద పూర్తిచేసిన ఎంట్రీలే అంగీకరించబడతాయి. 2. మీరు కోరుకున్నన్ని ఎంట్రీలు పంపవచ్చు. ప్రతి ఎంట్రీకి ఏప్రిల్, మే 1983 చందమామ సంచికలలో లభించే పోటీ కూపన్ చేర్చివుండాలి. 3. ఎంట్రీలు స్పష్టంగా నింపాలి. చందమామ ప్రచురింపబడే ఏ భాషలోనయినా పూర్తిచేయవచ్చు. 4, 31 మే 1983 లోపున ఎంట్రీలు మాకు చేరాలి. 5. ఆలస్యంగా అందిన, పోయిన లేక పాడయిన ఎంట్రీలకు నిర్వాహకుల బాధ్యత లేదు. 6. ఎంట్రీలు మామూలు పోస్ట్‌లోనే పంపాలి. 7. చందమామ పబ్లికేషన్స్, హిందుస్థాన్ థామ్సన్ అసోసియేట్స్ ఉద్యోగులు మరియు వారి బంధువులు తప్ప భారతీయ పౌరులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును. 8. సర్వస్వతంత్రంగా వ్యవహరించే న్యాయనిర్ణేతల బృందం ఎంట్రీలని పరిశీలిస్తుంది. వారిదే అంతిమ నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు. 9. విజేతలకి వ్యక్తిగతంగా పోస్ట్‌ద్వారా తెలియ...




## ప్రవేశ పత్రం

ఉదాహరణలో చూపించిన విధంగా ఈ పేర్లని కింది బొమ్మలతో జతపరచండి :

1. అర్జునుడు 2. నారదుడు 3. విశ్వామిత్రుడు 4. హనుమంతుడు 5. రావణుడు 6. వసిష్ఠుడు

నాకు చందమామ అంటే ఇష్టం ..............................................................

..............................................................................................

.............................................................................. (10 మాటలలో)

పేరు ______________________ వయసు ______

చిరునామా ______________________________

పోస్ట్ చేయవలసిన చిరునామా: కాంటెస్ట్ కో-ఆర్డినేటర్
చందమామ పబ్లికేషన్స్
మద్రాసు 600 026

# మన సంస్కృతిని తెలుసుకోండి పోటీ కూపన్

ప్రతి ఎంట్రీకీ ఈ కూపన్ జతచేయాలి

**త్వరపడండి ఎంట్రీలు చేరడానికి ఆఖరిరోజు 31మే, 1983.**

HTM-CMP-1149

నా విమానంలో మేఘాల్లోకి ఎగిరేపోతానూ
ఊరుకుందిక ఉరిమే మేఘం జెమ్స్ తిన్నాకా
నేలమీద మనకంతా ఎంతెంతో సరదాగా
నీకూ జెమ్స్, నాకూ జెమ్స్, అందరికోసంగా!




చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని !

క్యాడ్‌బరీస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరీస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''నలుగురు పెళ్ళి కొడుకులు'']కు ఆధారం ''వసుంధర'' రచన.

రాజ్యాలను పాలించే రాజులకైనా, సామాన్యులకైనా ఏవో సమస్యలు ఎదురవక తప్పదు. అలాంటి సమయాల్లో, సమస్యను క్షుణ్ణంగా అర్థం చేసుకుని, పరిష్కారమార్గం ఆలోచించాలి. అనాలోచితంగా చేసే నిర్ణయాలు సమస్యను ఎలా క్లిష్టంచేయగలవో, ''సామంతరాజు'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

అల్పోధికార లాభాత్తు, స్వామినో వ్యతిరిచ్యతే,
వాలుకోష్ణత్వ మత్యుగ్రం, వివస్వ త్తాపవాదపి.

[అల్పుడికి అధికారం యిస్తే, తన యజమానిని మించిన అధికార దర్పం చూపుతాడు. సూర్యుడి వేడి కంటే, ఆ వేడివల్ల కాలిన ఇసుక వేడి ఎక్కువ గదా!]

సంపుటి 72 మే '83 సంచిక 5

విడి ప్రతి : 2–00 : : సంవత్సర చందా : 24-00








# పిసినారి పిశాచం

పీతాంబరానికి పిసినారి అని పెద్ద పేరు. అతడి పిసినారితనం గురించి, ఊళ్ళోని జనం కథలుగా చెప్పుకునేవాళ్ళు.

అతడి భార్య కామాక్షి కాపురానికి వచ్చాక, ఆమె నాలుక చవిచచ్చిపోయింది. రోజూ రెండు పూటలా మాగాయతో భోజనం, నీళ్ళమజ్జిగ తాగడం! అయితే, కామాక్షి స్వతహాగా చాలా నెమ్మదస్థురాలు కావడంతో, అన్నిటికీ సర్దుకు వస్తున్నది.

తన దుకాణానికి కావలసిన సరుకుల కోసం, పీతాంబరానికి తరచూ పట్నం వెళ్ళవలసిన పని తగులుతూండేది. ఒకసారి అతను అలాగే పట్నం వెళ్ళి, మర్నాటి ఉదయం ఇంటికి తిరిగి వచ్చాడు. తలుపు తెరిచిన కామాక్షి ముక్కున తళుక్కుమంటూ, కొత్త ముక్కుపుడక మెరిసింది.

పీతాంబరం ఒక్క క్షణం ఆశ్చర్యపోయి, అంతలోనే పట్టరాని కోపంతో, ''ముక్కెర ఎప్పుడు చేయించావే, కోతి మొహమా? చూస్తుంటే, నా ఇల్లు గుల్ల చేస్తున్నట్టున్నావు!'' అన్నాడు.

''ఉష్, అంత పెద్దగా అరవకు. లోపలికి వచ్చాక సంగతంతా చెబుతాను!'' అన్నది కామాక్షి చిన్నగొంతుతో.

పీతాంబరం కస్సుబుస్సులాడుతూ లోపలికి రాగానే, ఆమె అతడికి యిలా చెప్పింది :

కామాక్షికి మినపసున్ని అంటే మహా ప్రీతి. అయితే, పెళ్ళయిన యీ ఐదేళ్ళుగా ఆమె సున్ని ఉండల మొహం చూడలేదు. ఆ కారణంగా ఆమె, భర్త పట్నం వెళ్ళగానే తన దగ్గిరున్న కొద్దిపాటి డబ్బుతో మినుములు, బెల్లం, నెయ్యి కొని తెచ్చింది.

మాచిరాజు కామేశ్వరరావు

ఈ సున్నిఉండల సంగతి ఇరుగుపొరుగుకు కూడా తెలియకూడదనుకుని, కామాక్షి ఊరు బాగా మాటుమణిగాక మినుములన్ని దోరగా వేయించి విసిరి, బెల్లం మెత్తగా తరిగి పిండిలో వేసి, కాచిన నెయ్యి పోసి సున్ని ఉండలు నొక్కసాగింది.

"ఇన్నాళ్ళూ, ఈ ఇంట మాగాయ కంపుతో వాంతి వచ్చేలా వుంది. సున్ని ఉండల వాసనతో, పోయే ప్రాణం తిరిగి వచ్చింది. ఇంత ఘుమఘుమలాడే వాసనకు తగ్గ రుచివుండే వుంటుంది! నాకూ నాలుగు సున్ని ఉండలు పెట్టవూ?" అంటూ ఒక ఆడపిశాచి గదిలో ప్రత్యక్షమైంది.

పిశాచాన్ని చూడగానే కెవ్వుమని గుడ్లు తేలవేసింది, కామాక్షి.

"భయపడకు, కామాక్షి! నేను పరాయి దయ్యాన్నేం కాదు; మీ పెరట్లో వున్న చింతచెట్టు మీద వుంటున్నాను," అన్నది పిశాచి సౌమ్యంగా.

ఆ మాటలతో కామాక్షి భయాన్నుంచి తేరుకుని, గబగబా నాలుగు సున్ని ఉండలు ఒక పళ్ళెంలో పెట్టి, పిశాచానికి యిచ్చింది.

పిశాచం ఆనందంతో రాగాలు తీస్తూ, సున్ని ఉండలు తిని, "అప్పుడప్పుడూ యిలా పిండివంటలుచేసి, నన్ను పిలుస్తూ



వుంటావుగదా? ఆ పని నీ భర్త ఇంట లేనప్పుడే చేస్తూ వుండు. నాకు మగజీవాలంటే తగనిభయం. నీ రుణం ఉంచుకోనులే," అంటూ పిశాచం కనబడకుండా పోయింది.

అది వెళ్ళాక చూస్తే, సున్ని ఉండల పళ్ళెంలో మెరుస్తూ ముక్కొరవున్నది!

కామాక్షి భర్తకు యిలా చెప్పి, "చూశావా, మన ఖర్చుకు వందరెట్లు లాభం వచ్చింది," అన్నది.

అంతా విన్న పీతాంబరానికి కళ్ళు మెరిశాయి. అతడు యింతకాలంగా పిండివంటలు చేయనందుకు భార్యను తిట్టి, "ఇకనుంచయినా అప్పుడప్పుడూ పిండి



వంటలు చేస్తూ, పిశాచాన్ని పిలుస్తూండు. ఏం చేసినా దానివరకే! ఆ సంగతి బాగా గుర్తుంచుకో," అంటూ గట్టిగా హెచ్చరించాడు.

ఆ రోజు నుంచీ పీతాంబరం అవసరం అయిన పనులేం లేకపోయినా, పిశాచం కోసం రాత్రివేళల్లో అక్కడా యిక్కడా తిరిగి వస్తూండేవాడు. కామాక్షి క్రమంగా చేతులకు గాజులూ, చెవులకు జూకాలూ, వేళ్ళకు నాలుగైదు ఉంగరాలూ సంపాయించుకున్నది.

అయితే, పీతాంబరానికి యిందువల్ల తృప్తి కలగలేదు. అతడికి పిశాచాన్నుంచి పెద్ద మొత్తంలో ధనం సంపాయించాలని వున్నది. ఆ ఆశతో అతడు రోజూ చీకటి పడేవేళ చింతచెట్టు కింద నిలబడి, "ఓం, ఆడపిశాచమా, నీది ఎంతటి ఉదారబుద్ధి! నా భార్యను సొంత కూతురు కన్న ఎక్కువగా చూసుకుంటున్నావు. నాకూ ఒకసారి కనిపించు," అని చేతులెత్తి మొక్కుతూండేవాడు.

ఇంత చేసినా పిశాచం అతడి కంట బడలేదు. ఎలాగయినా పిశాచాన్ని కలుసుకుని, దాన్నుంచి పెద్ద మొత్తం సంపాయించాలనుకుని పీతాంబరం ఒక రోజున భార్యతో తాను పట్నం పోతున్నట్టు అబద్ధం చెప్పాడు.

"అలాగే వెళ్ళిరండి! పిశాచానికి కొబ్బరి పాయసం అంటే చాలా యిష్టం. ఈ రాత్రికి అది చేస్తాను," అన్నది కామాక్షి.

భార్య వంటగదిలోకి పోగానే, పీతాంబరం చప్పున అటక ఎక్కి కూర్చున్నాడు. కొద్దిసేపటికి యాలకుల వాసనతో ఘుమఘుములాడుతూ పాయసం తయారైంది. ఆ సరికి చీకటిపడి బాగా పొద్దుపోయింది.

కామాక్షి పాయసం గిన్నెను మధ్యగదిలో పెట్టుకుని అవురావురుమంటూ తినసాగింది. అటక మీద వున్న పీతాంబరం భార్య పిశాచం కోసం కొంత

మిగులుస్తుందనుకున్నాడు. కాని, ఆమె మొత్తం తినేసింది.

ఇది చూసిన పీతాంబరం ఆవేశం పట్టలేక, అటక మీదినుంచి కిందికి దూకి, "అంత ఖరీదైన పాయసం అంతా తినేస్తావా! కడుపు నింపుకోవాలంటే మాగాయ మెతుకులు చాలవా? ఇప్పుడు పిశాచం వస్తే, ఏం పెడతావు?" అంటూ భార్యను గద్దించాడు.

కామాక్షి వెలవెలపోయి కళ్ళ నీళ్ళు పెట్టుకుని, "పిశాచం లేదు ప్రేతం లేదు—మాగాయ ముద్దలు మింగలేక, యీ నాటకం ఆడాను. పదిమంది ఇంట పడి తిన్నా తరగని ఆస్తి మనది!" అన్నది.

పీతాంబరం భార్య మాటలు నమ్మలేక, "అయితే, ఆ నగలన్నీ నీకెలావచ్చినై?" అని అడిగాడు.

"అవన్నీ పూతబంగారం నగలు," అన్నది కామాక్షి.

పీతాంబరం కళ్ళెర్రచేసి, పళ్ళు కొరుకుతూ తలుపు పక్కన వున్న దుడ్డుకర్ర చేతికి తీసుకునేంతలో, "ఆగాగు! ఒళ్ళు మరిచిన ఆవేశం కీడుకు దారి తీస్తుంది!" అంటూ ఒక ఆడ పిశాచం అతడి ముందుకు వచ్చింది.

దాన్ని చూస్తూనే పీతాంబరంతోపాటు కామాక్షి కూడా నిలువునా వణికిపోసాగింది. పిశాచం వాళ్ళకు భయపడవద్దని చెప్పి, పీతాంబరంతో, "నీ భార్య



ఆడిన నాటకంలో కొంత నిజం లేకపో లేదు. నా నివాసం మీ పెరటి చింతపైనే,'' అన్నది.

ఆ మాటలతో కొద్దిగా ధైర్యం తెచ్చు కున్న పీతాంబరం, ''అద్దె బాధ వుండ దని ఆ చింత చెట్టుపై చేరావా? మా భార్యా భర్తల తగువుల్లో, నీకేం పని? పో, యిక్కణ్ణుంచి,'' అన్నాడు.

''అలాగే పోతాను. కాని, పోయే ముందు కామాక్షంటే నాకున్న అభిమానం కొద్దీ రెండు మాటలు చెప్పదలిచాను. బతికున్న రోజుల్లో, నేను నీకన్న పిసిని గొట్టును. నా భర్త సంపాదన అంతా దాచిపెట్టి, ఇంటిల్లిపాదికీ కారం మెతు కులూ, పచ్చిపులుసూ పోసేదాన్ని. దాచిన డబ్బు దొంగలు తస్కరించుకుపోయారు. ఆ బెంగతో చచ్చి పిశాచాన్నయాను. నేను చచ్చినందుకు బాధపడినవాళ్ళు లేక పోవడం, నాకు పెద్ద బాధ అనిపించింది. పిసినారితనం అనేది ఒక పిశాచిలాంటిది! దాన్ని వదిలించుకోవడం మనిషికి అసాధ్యం ఏం కాదు. మనిషికి పొదుపు అవసరం; అయితే అది పిసినారితనం కాకూడదు,'' అన్నది పిశాచం.

పీతాంబరం ఆ మాటలు విని, తనూ పిశాచి అయిపోయినట్టు ఊహించుకుని వణికిపోయాడు. అతడు పిశాచికి రెండు చేతులూ జోడించి, ''నీ మేలు జన్మలో మరవను! ముందు, ముందు నేను మరొక పిసినారిపిశాచంగా, ఆ చింత మీద చేరకుండా కాపాడావు,'' అన్నాడు.

''ఇన్నాళ్ళకు ఒక మంచి పని చేశాను. నాకు చాలా సంతోషంగా వుంది,'' అంటూ పిసినారి పిశాచం నవ్వుతూ కిటికీలోంచి పెరట్లోకి వెళ్ళిపోయింది.

పీతాంబరం భార్యతో, ''నన్ను క్షమించు, కామాక్షి! ఇన్నాళ్ళూ నిన్ను చాలా కష్టపెట్టాను. ఆ పాత పీతాంబరాన్ని మర్చిపో. ఈ రోజే మనిద్దరికీ పెళ్ళయిం దని అనుకుందాం,'' అన్నాడు.

ఆ మాటలకు కామాక్షి పరవశించి పోయి, భర్త పాదాలను కళ్ళకద్దుకున్నది.






పూర్వం అవంతీనగరంలో, ఒక ముసలి వర్తకుడుండేవాడు. అతడు వయసులో వుండగా, ఖండాంతరాల్లోని అనేక దేశాలు తిరిగి, ఓడవర్తకం వల్ల చాలా ధనం గడించాడు. కాలక్రమాన వయసు ముదిరి, వృద్ధాప్యం మీద పడుతూండగా, అతడు తన వ్యాపారాన్ని కొడుకులకు అప్పగించాలని ప్రయత్నించాడు. కాని, అతడి ముగ్గురు కొడుకుల్లో పెద్దవాళ్ళయిన జీవదత్తుడూ, లక్షదత్తుడూ ఎందుకూ పనికిరానివారుగా తయారయారు.

వాళ్ళు దురలవాట్లకు లోనై, యింటి పట్టునే వుండేవాళ్ళుకాదు. మూడవవాడైన పింగళుడికి యింకా యిరవై ఏళ్ళయినా నిండలేదు. ముసలివర్తకుడు దిగులుతో మంచం పట్టి, మరణించే ముందు, తన యావదాస్తినీ ముగ్గురు కొడుకులకూ, భార్యకూ సమంగా పంచి యిచ్చాడు. తండ్రి మరణించగానే, పెద్దవాళ్ళయిన జీవదత్తుడూ, లక్షదత్తుడూ తమకు సంక్రమించిన ఆస్తిని, విచ్చలవిడిగా ఖర్చుపెట్ట సాగారు. తన పెద్దకొడుకులు యిద్దరూ నిష్ప్రయోజకులని గ్రహించిన తల్లి, తన వాటాకు వచ్చిన ఆస్తితో చిన్నవాడైన పింగళుడి యింటికి వెళ్ళి, అక్కడే వుండ సాగింది.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ తమ చేజిక్కిన డబ్బు అయిపోగానే, తల్లిని వెతుక్కుంటూ, పింగళుడి యింటికి వచ్చారు. పింగళుడు అన్నలను చాలా



ఆదరంతో ఆహ్వానించాడు. కాని, వాళ్ళిద్దరూ వస్తూనే పింగళుడిని గట్టిగా కసిరి కొట్టి, గబగబా తల్లి దగ్గరకు వెళ్ళి, ఆమెను తమ యింటికి రావలసిందిగా అడిగారు.

తనంటే, ఏమాత్రం గౌరవం గాని, ప్రేమగాని లేని పెద్దకొడుకు లిద్దరూ, తనను వాళ్ళ ఇంటికి రమ్మని అడగటంలో వున్న రహస్యం ఏమిటో ఆమె గ్రహించింది. భర్త యిచ్చిపోయిన ధనంకోసం, వాళ్ళు తనమీద లేని ప్రేమ నటిస్తున్నారు. అందుకని ఆమె కొడుకు లిద్దరితో కొంచెంసేపు మంచిగా మాట్లాడి, "మీరిద్దరూ పెద్దవాళ్ళు. మీ బ్రతుకు మీరు బ్రదగ్గలరు. పింగళుడు అలా కాదు. వాడికింకా పసితనమే వదలలేదు. కనుక, నేను వాడి దగ్గరే వుండటం, అన్నివిధాలా బావుంటుంది," అన్నది.

దానికి పెద్దవాళ్ళిద్దరూ మండిపడి, "సరే, నువ్వు వాడి దగ్గిరే వుండు, మా అభ్యంతరం ఏమీ లేదు. కాని, మా తండ్రి నీ పేర పెట్టిపోయిన ఆస్తిలో మా భాగం మాకు యిచ్చెయ్యి," అన్నారు.

"నే బ్రతికుండగానే, దాంట్లో మీకు భాగం ఎలా వస్తుంది?" అన్నది తల్లి ఆశ్చర్యపోతూ.

"ఆ భాగం యిప్పుడు కాకపోతే, తరవాత మాకు దక్కుతుందన్న ఆశ లేదు. ఆ డబ్బు కాస్తా కాజేసి, పింగళుడు నిన్ను అయిపూ అజా లేకుండా చేస్తే, మేము ఏం కావాలి?" అన్నారు పెద్దకొడుకులు.

అన్నలు యీ విధంగా మాట్లాడటం, పింగళుడికి చాలా అవమానకరంగా తోచింది. అతడు తల్లి దగ్గరకు వెళ్ళి, "అమ్మా, నువ్వు కావాలంటే, అన్నయ్యల దగ్గిరికే వెళ్ళు. నీ ఆస్తిలో ఒక దమ్మిడీ కూడా నా కవసరం లేదు," అన్నాడు.

తల్లి అందుకు అంగీకరించ లేదు. దానితో పెద్దకొడుకు లిద్దరూ పట్టరాని కోపంతో తల్లిని కర్రలతో మోదసాగారు. చిన్నవాడైన పింగళుడు అడ్డుపడ్డాడు.

దానితో వాళ్ళు మరింత రెచ్చిపోయి, వాణ్ణి చావ చితకబాదారు.

తల్లి ఎట్లాగో యింటినుంచి బయటపడి, యిరుగు పొరుగు వాళ్ళను పిలుచుకు వచ్చింది. వాళ్ళు పెద్దకొడుకు లిద్దర్నీ గట్టిగా చీవాట్లు పెట్టారు. దానితో జీవదత్తుడూ, లక్షదత్తుడూ యింటి నుంచి బయటికి పోతూ, "మేం లోకజ్ఞానం లేని అర్భకులం కాదు. మీ యిద్దర్నీ న్యాయస్థానానికి పిలిపిస్తాం. ఆస్తి ఎక్కడికి పోతుందో చూస్తాం," అన్నారు.

వారం తిరక్కుండానే. జీవదత్తుడూ, లక్షదత్తుడూ అన్నంత పనీ చేశారు. వాళ్ళు న్యాయస్థానంలో తల్లి మీదా, తమ్ముడి మీదా వ్యాజ్యం వేశారు. దానితో తల్లికీ, పింగళుడికీ న్యాయస్థానం నుంచి పిలుపు వచ్చింది. వాళ్ళు న్యాయస్థానానికి వెళ్లారు. న్యాయాధిపతి పెద్దవాళ్ళిద్దరి దగ్గిరా లంచం తీసుకుని వున్నవాడవటంచేత, తల్లికీ, పింగళుడికీ వ్యతిరేకంగా తీర్పు చెప్పాడు.

పింగళుడు తనకూ, తల్లికీ అన్యాయం జరిగిందని పై న్యాయస్థానానికి మొరపెట్టుకున్నాడు. నెల రోజులు న్యాయస్థానం చుట్టూ తిప్పి, న్యాయాధిపతి చివరకు తల్లికీ పింగళుడికీ అనుకూలంగా తీర్పు యిచ్చాడు.




తీర్పు తమకు అనుకూలంగా జరిగినా, మధ్యవర్తులమంటూ వచ్చి, రాజీరాయబారాలు జరిపినవారికీ, న్యాయవాదులకూ పెద్ద మొత్తాలు యివ్వటం ద్వారా పింగళుడూ, తల్లీ ఆస్తి అంతా పోగొట్టుకున్నారు. జీవదత్తుడూ, లక్షదత్తుడూ కూడా కటిక దరిద్రులైపోయారు. వాళ్ళిద్దరూ యిక పొట్ట గడిచే మార్గం లేక, వీధుల వెంట తిరుగుతూ బిచ్చం ఎత్తసాగారు.

పింగళుడు తమకు కలిగిన దురదృష్టానికి చింతించలేదు. అతడు తల్లికి ధైర్యం చెప్పి, ఒక వల తీసుకుని చేపలు పట్టేందుకు నదికి వెళ్ళాడు. చేపలు పట్టే వృత్తికి కొత్తవాడయినా, పింగళుడు

ఆ సాయంత్రం వరకూ నదిలో వల వేసి చాలా చేపలు పట్టగలిగాడు. వాటిని బజారులో అమ్మి, ఆ డబ్బుతో ఒక దుకాణదారు దగ్గిర, ఇంటికి కావలసిన సంబారాలన్నీ కొన్నాడు.

ఈ విధంగా పింగళుడు పగలల్లా కష్టించి చేపలుపట్టి, అవి అమ్మగా వచ్చిన డబ్బుతో సుఖంగా కాలం గడుపుతున్నాడు. కొద్ది రోజులకే యీ సంగతి అన్నలిద్దరికీ తెలిసింది. వాళ్లు పింగళుడు నదికి వెళ్ళిన సమయంలో బావురుమని ఏడుస్తూ తల్లి దగ్గిరకు వచ్చి, ఆకలితో మలమల మాడిపోతున్నామని మొరపెట్టుకున్నారు. లోగడ తనకు ఎంత అన్యాయం చేసివున్నా, పుత్రప్రేమ కొద్దీ, అవన్నీ మరిచిపోయి, తల్లి వాళ్ళిద్దరకూ చక్కని భోజనం పెట్టింది.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ తల్లికి కృతజ్ఞత చెప్పుకుని, గతంలో తాము చేసిన అన్యాయాలకు పశ్చాత్తాపం వెలిబుచ్చారు. తల్లి కూడా వాళ్ళమీద జాలి తలిచి, తమ్ముడు లేని సమయంలో రోజూ వచ్చి, అన్నం తిని పోవలసిందని వాళ్లకు చెప్పింది. పనిపాట్లు చేసుకుని గౌరవంగా బ్రతకటానికి వళ్ళు వంగని పెద్దవాళ్ళిద్దరూ, యిందుకు చాలా సంతోషించి, కేరింతలు కొడుతూ వీధిలోకి వెళ్లిపోయారు.

పింగళుడికి యివేమీ తెలియవు. అతడు ప్రతి దినం సూర్యోదయంతోపాటే



లేచి వల తీసుకొని నదికి పోతూండేవాడు. ఒకనాడు, ఎందుకనో అతడు ఎంతసేపు నదిలో వల వేసినా ఒక్క చేప కూడా పడిందికాదు. ఏమా యీ దురదృష్టం అనుకుంటూ, అతడు సూర్యాస్తమయం వరకూ ప్రయత్నించి, ఏమీ దొరకక, వల భుజాన వేసుకుని దిగాలుపడి యింటి మార్గం పట్టాడు. దారిలో ప్రతి దినం అతడు సామాను కొనే దుకాణంవాడు, ఆ రోజు పింగళుడు దుకాణం దగ్గరకు రాకుండా పోవటం చూసి, అతడిని కేక వేశాడు.

పింగళుడు దుకాణంవాడి దగ్గరకు పోయి, ఆ రోజు తనకు నదిలో ఒక్కగా నొక్క చేప అయినా దొరకలేదనీ, అందు వల్ల తన దగ్గిర డబ్బు ఏమీ లేదనీ చెప్పాడు. ఆ మాటలు వింటూనే దుకాణం వాడు నవ్వి, "నీకు అవసరమైన సంబారాలన్నీ రోజూ యిక్కడే కొనుక్కు పోతూండేవాడివి గదా! అలాంటప్పుడు, ఈ రోజు డబ్బు లేకపోతే మాత్రం ఏం పోయింది? అవసరమైన సరుకులు తీసుకుపో. రేపు డబ్బిద్దువుగాని," అన్నాడు.

పింగళుడు, దుకాణంవాడి దయకు కృతజ్ఞత చెప్పి, కావలసిన సామానులు తీసుకుని, వుత్సాహంగా బయలుదేరి, రోజూకన్న కొంచెం ముందుగా యిల్లు చేరాడు. ఆ సమయంలో, పింగళుడి అన్నలిద్దరూ, యింట్లో సుఖంగా భోజనం



చేస్తూ, తల్లితో కబుర్లాడుతున్నారు. హఠాత్తుగా పింగళుడు లోపలకు వచ్చేసరికి, వాళ్ళిద్దరూ గడబిడపడి సిగ్గుతో తల వంచుకుని పారిపోజూశారు.

పింగళుడు అన్న లిద్దర్నీ ప్రేమతో కౌగలించుకుని, "అన్నల్లారా! మీరు వున్నంతలో హాయిగా భుజించండి. జరిగిపోయిందేదో జరిగిపోయింది. అదంతా మరిచిపోదాం. మనం ఒక్క తండ్రి సంతానం గదా!" అన్నాడు.

తమ్ముడు యిలా అనేసరికి, పెద్ద వాళ్ళిద్దరికీ ఎక్కడలేని ఆనందం కలిగింది. వాళ్ళు పింగళుడిని మెచ్చుకుని, "నువ్వు యింత మంచివాడివని మాకు తెలియదు. తెలిస్తే, అనవసరంగా నీమీద వ్యాజ్యం వేసి, మా ఆస్తితోపాటు నీది కూడా పోగొట్టేవాళ్ళం కాదు," అన్నారు, విచారిస్తూన్నట్టు.

ఇన్నాళ్ళకు కొడుకులు, విరోధ భావం మాని, ఒకటైనందుకు తల్లి సంతోషించింది.

పింగళుడు ఆ మరసటి రోజున కూడా మామూలు వేళకే నదికి వెళ్ళాడు. ఆ రోజున కూడా సాయంత్రం వరకూ ప్రయత్నించినా వలలో ఒక్క చేప కూడా పడలేదు. అతడు తన దురదృష్టాన్ని నిందించుకుంటూ, యింటికి పోతూండగా దుకాణంవాడు మళ్ళీ పిలిచి, సంగతి తెలుసుకుని అప్పుగా మరికొంత సామాను యిచ్చాడు.



ఈ విధంగా వరసగా పది రోజులు నదిలో చేపలు దొరకకపోయేసరికి, పింగళుడు విసిగి, పదకొండవ రోజున, పొద్దునే బయలుదేరి అక్కడికి క్రోసు దూరంలో వున్న చిలక సరస్సుకు చేపల కోసం వెళ్ళాడు.

చిలకసరస్సులో అతడు వల వేసి ఒడ్డున కూర్చునేంతలో, మైదానం మీద ఒక గుర్రపు రౌతు వస్తూన్న సూచనగా దుమ్ము లేచింది. పింగళుడు ఆ వచ్చే వాడు ఎవడై వుంటాడా అనుకునేంతలో, రౌతు గుర్రాన్ని దూకిస్తూ, పింగళుడు వున్న చోటుకు వచ్చి, ''పింగళా! నువ్వు నాకో సాయం చేసిపెట్టాలి!'' అంటూ గుర్రం దిగాడు.

తను ముక్కూ మొహం ఎరగనివాడు, సరాసరి దగ్గరకు వచ్చి, పేరుపెట్టి పిలిచే సరికి పింగళుడికి చాలా ఆశ్చర్యం కలిగింది. అతడు ఆ వచ్చినవాడి కేసి అనుమానంగా చూస్తూ, ''నా పేరు మీకెలా తెలుసు? మీకు కావలసిన సాయం ఏమిటి?'' అన్నాడు.

ఆ ప్రశ్నలకు, ఆ కొత్తవాడు నవ్వి, ''నీ పేరేమిటో, నీ ఊరేదో నువ్వే సమయంలో యీ చిలక సరస్సు దగ్గిర చేపలు పడుతూ వుంటావో — అదంతా మా గురువుగారు, నువ్వు పుట్టకముందే నాకు చెప్పారు. అది నలభై ఏళ్ళ కిందటి మాట! నేనడిగిన సాయం చెయ్యగలవా?'' అన్నాడు.



"అదేదో చెప్పండి. ఇంతకూ మీ పేరే మిటో చెప్పారుకాదు!" అన్నాడు పింగ ళుడు వినయంగా.

"నా పేరు మండనుడు. పోతే, నువ్వు చేయవలసిన సాయం ఏమంత కష్టమైంది కాదు. నా చేతులు రెండూ తాడుతో వెనక కట్టివేసి, నన్ను ఎత్తుకుపోయి సరస్సులో పడవెయ్యి. కొద్దిసేపు తరవాత నా తల, ముందు నీటిపైన కనబడితే, వల వేసి నన్ను బయటికి లాగు. అలాకాక, కాళ్లు గాని ముందు తేలితే, నువ్వు యీ గుర్రాన్ని పట్టణంలోకి తీసుకుపోయి, కాంచన మిశ్రుడు అనే వర్తకుడికి ఒప్పచెప్పా వంటే, అతడు నీకు నూరు మొహరీలు యిస్తాడు," అన్నాడు.

పింగళుడు, మండనుడు చెప్పినట్టు చేయటానికి అంగీకరించాడు. మండ నుడు, గుర్రపు జీనుకు వేలాడుతున్న ఒక తాడు తెచ్చి, పింగళుడికి యిచ్చాడు.

పింగళుడు, మండనుడి చేతులను వెనక్కు విరిచికట్టి, అతణ్ణి భుజాన వేసు కుని సరస్సు ఒడ్డున నిలబడి, అతణ్ణి సరస్సులోకి విసిరివేశాడు.

ఒకటి రెండు నిమిషాల కాలం సరస్సులో అలలు లేచి సర్దుమణిగిం తరవాత, మండనుడి కాళ్ళు ముందుగా నీటిపైకి తేలినై. "పాపం, చచ్చి పోయాడు!" అనుకుంటూ పింగళుడు, మండనుడి గుర్రాన్ని తీసుకుని పట్టణం లోకి వెళ్ళాడు.

అక్కడ అతడికి గొప్ప వర్తకుడైన కాంచనమిశ్రుడి దుకాణం తెలుసు కోవటం ఏమీ అంత కష్టం కాలేదు. కాంచనమిశ్రుడు, పింగళుడినీ, అతడి వెంట వున్న గుర్రాన్నీ చూస్తూనే, "దురాశ దుఃఖం చేటు!" అంటూ గొణిగి, పెట్టెలో నుంచి, డబ్బు తీసి నూరు మొహరీలు లెక్క పెట్టి పింగళుడికి యిస్తూ, "అబ్బాయ్, ఎందుకైనా మంచిది గాని యీ సంగతి కాస్తా రహస్యంగా వుంచు. అది నీకు చాలా క్షేమం కూడా!" అన్నాడు. —(ఇంకా వుంది)






# నలుగురు పెళ్ళికొడుకులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ నిన్నింతగా కష్టాలపాలు చేస్తున్న వాడెవడైనా, మీరు ఒకరి నొకరు తప్పు అంచనా వేసుకున్నారేమో అన్న శంక నాకు కలుగుతున్నది. మనుషులు తమ జీవితాలనే కాక, తమ ఆప్తుల జీవితాలను కూడా సుఖమయ మార్గాన తీర్చిదిద్దాలని ప్రయత్నించడం, నీకు తెలియంది కాదు. కాని, అందుకై చేసే ప్రయత్నాల్లో ఒక్కొక్కసారి విజయంతో పాటు అపజయం కూడా ఎదురవుతుంది. ఇలా విజయానికీ, అపజయానికూడా మూలకారణం, మనిషి తన తోటివాళ్ళను గురించి వేసే అంచనాలపై ఆధారపడి

## బేతాళ కథలు



వుంటుంది. ఇందుకు ఉదాహరణగా, నీకేమైనా మేలు చేయగలదన్న అభిప్రాయంతో, సుందరయ్య అనే ఒక ధనికుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్ప సాగాడు:

సుందరయ్య చాలా ధనవంతుడు. ఆయనకు ఒకేఒక్క కుమార్తె; ఆమె గొప్ప సౌందర్యవతి. యోగ్యుడైన వాడిని అల్లుడుగా తెచ్చుకుని, తన ఆస్తినంతా అతడికి కట్టబెట్టాలని ఆయన యోచన.

సుందరయ్యకు చిన్ననాటి స్నేహితులు నలుగురున్నారు. వాళ్లనలుగురూ, నాలుగు వేర్వేరు గ్రామాల్లో స్థిరపడిపోయారు. వాళ్ళ నలుగురికి కూడా తన కూతురికి యీడుగావుండే కొడుకులున్నారని ఆయనకు తెలిసింది. వాళ్ళలో ఒకడిని తన కూతురికి చేసుకోవాలనే ఉద్దేశంతో సుందరయ్య, వాళ్ళుండే గ్రామాలకు బయలుదేరాడు.

ముందుగా ఆయన ఐనాపురంలోని చంద్రకాంతుణ్ణి కలుసుకున్నాడు. చంద్రకాంతుడు, సుందరయ్యకు మించిన వైభోగంలో తేలిపోతున్నాడు. ఆయన సుందరయ్యను ఎంతో అభిమానంతో ఆదరించాడు. చిన్ననాటి అనుభవాలు తనే గుర్తుచేశాడు. చంద్రకాంతుడు కొడుకు పుష్పకాంతుడు చాలా అందంగానూ, సంస్కారవంతుడుగానూ కనిపించాడు, సుందరయ్యకు. ముఖ్యంగా వాడి వినయ గుణం ఆయన్ని ఎంతగానో ఆకర్షించింది.

మాటల మధ్య సుందరయ్య తన కూతురి ప్రసక్తి తెచ్చాడు. ఆమె పేరు విన్న చంద్రకాంతుడు, ''నీ కుమార్తె పేరు చంప అన్నావుకదూ? మా వాడి ప్రియమైన గుర్రం పేరు కూడా అదే! ఆ గుర్రం చూడ్డానికి దేవలోకం నుంచి దిగివచ్చిన ఉచ్చైశ్రవంలా వుంటుంది. అన్నట్టు, నువ్వు, మా గుర్రాలశాల చూడలేదుకదా,'' అంటూ సుందరయ్యను తన అశ్వశాలకు తీసుకువెళ్ళాడు.

అక్కడి గుర్రాలను చూసి సుందర య్యకు నోట మాట రాలేదు. తన ఆస్తి అంతా కలిపినా, ఆ గుర్రాల విలువ చెయ్యదు.

ఐనాపురం నుంచి సుందరయ్య మల్లపురం వెళ్ళాడు. అక్కడ ఆయన స్నేహితుడు భద్రుడు కూడా ఎంతో అభిమానంగా ఆదరించాడు.

ఆ ఊరిలో భద్రుడికి పేరు ప్రతిష్ఠలున్నవి. ఊళ్ళో ఏ వ్యవహారం గురించయినా అంతా వచ్చి ముందు భద్రుడికి చెప్పుకుంటారు.

"ఏమో మరి! నీ కెంత పేరు ప్రతిష్ఠలున్నా, చంద్రకాంతుడి వైభవం మాత్రం లేదు." అన్నాడు సుందరయ్య.

"నాకేం తక్కువో చెప్పు?" అన్నాడు భద్రుడు కోపంగా.

"నీ ఆస్తి అంతా కలిపి, వాడి గుర్రాల విలువ చేయదేమో ననిపించింది. లక్ష వరహాల విలువ చేసే గుర్రాలు వాడి వద్ద పదిహేను వున్నవి." అన్నాడు సుందరయ్య.

భద్రుడు ఒక క్షణం ఆగి, "చంద్రకాంతుడిదంతా ఆర్భాటం! తన డబ్బును వస్తురూపంలోకి మార్చి, అందరి ముందూ ప్రదర్శించాలనుకుంటాడు. తలచుకుంటే, అంత కంటే మంచివి యాభై గుర్రాలు నేను కొనగలను. కానీ. అందు వల్ల ప్రయోజనం ఏమిటి? నా కొడుకు రోజంతా గుర్రపుస్వారీ చేస్తూ, అప్ర





యోజకుడిలా తిరగడం నాకిష్టం లేదు,'' అన్నాడు.

అంతేకాక భద్రుడు అన్నింటికీ చంద్రకాంతుణ్ణి తప్పు పట్టాడు. ఇంటి నిండా దాస దాసీ జనం వుంటే, ఇంట్లో వాళ్ళు బద్ధకస్థులైపోతారట. ప్రతిరోజూ పంచభక్ష్య పరమాన్నాలు తినడం ఆరోగ్యానికి మంచిది కాదట. నాలుగంతస్తుల మేడ కట్టించుకుంటే, అది కూలిపోయే ప్రమాద మున్నదట. అందుకే, తనకు చంద్రకాంతుడి కంటే ఎక్కువ డబ్బున్నప్పటికీ, సామాన్యంగా జీవిస్తున్నానన్నాడు భద్రుడు.

భద్రుడి కొడుకు రుద్రుడు కూడా తండ్రి మాట లన్నిటికీ వంతపాడాడు.

సుందరయ్య భద్రుడికి తనకుమార్తె గురించి చెప్పలేదు. ఆయన అక్కడ రెండు రోజులుండి వరుణపట్నం వెళ్ళాడు.

అక్కడ ఆయన మిత్రుడు నాగానందుడు అతి సామాన్యంగా జీవిస్తున్నాడు. అతడు సుందరయ్యను ఆప్యాయంగా ఆదరించి, తన గురించి చెప్పుకున్నాడు. మధ్యలో ఒకటి రెండుసార్లు చంద్రకాంతుడి గురించీ, భద్రుడు గురించీ ప్రసక్తిరాగా ఒకసారి నిట్టూర్చి, ఊరుకున్నాడు.

నాగానందుడి కొడుకు సత్యానందుడు, ''నేను కూడా పుష్పకాంతుడిలా వైభవంగా జీవించాలని నాన్న కోరిక. ఆ కోర్కె నెరవేరాలని నేను కొన్ని ప్రయత్నాలు చేశాను. అవి కొంతవరకు మాత్రమే ఫలించాయి. పూర్తిగా ఫలించాలంటే చాలా డబ్బు కావాలి. అంత డబ్బు కావాలంటే ఎలాంటి పని చేయడానికీ సిగ్గు పడకూడదు. వరుణపట్నం మాకు బాగా తెలిసిన ఊరు కాబట్టి, నేను మరేదైనా పట్నం పోవలసి వున్నది. కానీ, నాన్న ఆరోగ్యం బావుండక, నేనిక్కడే వుండి పోవలసి వచ్చింది,'' అన్నాడు.

సుందరయ్య అక్కడ కూడా తన కూతురు ప్రసక్తి తీసుకురాలేదు. ఒక రెండు రోజులున్నాక, అక్కడనుంచి

బయలుదేరి కృష్ణప్రస్థనగరంలోని తన మిత్రుడు సోమరాజును కలుసుకున్నాడు.

సోమరాజు జీవితం మరీ సామాన్యంగా వున్నది. సుందరయ్య అతనింట బస చెయ్యడానికే సంకోచించాడు. అయితే, సోమరాజు ఆయనను ఎంతో ఆప్యాయంగా ఆదరించాడు. రెండు రోజుల పాటు ఏ లోటూ లేకుండా చూసుకున్నాడు.

సోమరాజూ, అతడి కొడుకు భీమరాజూ ఒకేరకం ఆశయాలు కలిగిన మనుషులు. మనిషి సుఖంగా జీవించాలంటే తృప్తి అనేది వుండాలని, వాళ్ళ నమ్మకం. ఉన్నదానితో తృప్తిపడుతూ, తీరుబడి సమయంలో ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకునేందుకు వేదాంత గ్రంథాలు చదువుతూ కాలక్షేపం చేస్తున్నారు. ఇద్దరూ ఎల్లవేళలా ఎంతో సంతోషంగా కనబడతారు.

ఎటొచ్చీ సోమరాజు భార్య మాత్రం తనకు నగలు లేవనీ, భవంతులు లేవనీ, దాసదాసీజనం లేరనీ ఎంతగానో బాధపడుతున్నది.

సోమరాజు, సుందరయ్య ఎదటే భార్యతో, "ఆశకు అంతుండదు! ఇవన్నీ సంపాదించిన తరవాత, అప్పుడీ దేశానికి మహారాణివి కావాలనిపిస్తుంది, నీకు. ఏదో ఒక దశలో మనిషి అసంతృప్తి చెందక తప్పదు. అందుకే, ఆశను చంపుకుంటే, ఎలాంటి బాధా వుండదు," అన్నాడు.



సుందరయ్య తిరిగి తన ఊరు చేరుకుని, భార్యతో నలుగురు పెళ్ళికొడుకులను గురించీ చెప్పి, "మన అమ్మాయిని నాగానందుడి కొడుకు సత్యానందుడికిచ్చి చేస్తే సుఖపడుతుందని, నేననుకుంటున్నాను," అన్నాడు.

భార్య యిందుకు సరేనన్నది. కొద్ది రోజుల తరవాత సత్యానందుడికీ, సుందరయ్య కుమార్తె చంపకూ వివాహం జరిగిపోయింది.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, సుందరయ్య తన చిన్ననాటి స్నేహితులూ,

వాళ్ళ కొడుకులను గురించి తప్పుగా అంచనా కట్టాడని, నా నమ్మకం. పుష్ప కాంతుడు ఎంతో వైభవంగా బతుకు తున్నాడు. రుద్రుడిలో చిన్న మెత్తు దురాశా, అసూయల్లాంటివి లేవు. భీమ రాజు వేదాంతగ్రంథాలు చదువుతూ, యీ లోకాన్ని అర్థం చేసుకోవాలన్న మహదాశయంతో వున్నవాడు. వీళ్ళందర్నీ కాదని సుందరయ్య తన కుమార్తెను సత్యానందుడికిచ్చి చేయడంలో పొరబడ లేదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులు తుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సుందరయ్య నిర్ణయం సరైనది; అందులో ఆవగింజంత పొరబాటు కూడా లేదు. పుష్పకాంతుడికి సుందరయ్య ఆస్తి ఏమంత లెక్కలోనిది కాదు. చంప వాడింట అడుగుపెడితే, వాడి విలువైన గుర్రాలలో ఒకటి అవుతుంది తప్పితే, మనిషిగా చూడబడదు. రుద్రుడి మాట! వాడిలో నిజాయితీలేదు. తనకు లేనివన్నీ అనవసరమంటాడు తప్పితే, తన లేమిని ఒప్పుకోడు. ఇక భీమరాజుకు జీవితంలో ఏ ఆశలూ, వేటిపట్లా ఆకర్ష ణలుగాని, అభిరుచులుగాని లేవు. అలాంటివాడు పెళ్ళి చేసుకుంటే, భార్య అవస్థలపాలవుతుంది. పోతే, సత్యానం దుడిది గొప్పవాళ్ళను చూసి అసూయ కాక, పోటీపడే స్వభావం. వాడికి వాళ్ళ లాగే కృషిచేసి గొప్పవాడు కావాలన్న ఆశ వున్నది. అయితే, జీవితంలో మరేమీ పట్టించుకోకుండా, డబ్బుకోసమే కృషి చేసే ఆశపోతుతనం వాడిలోలేదు. తండ్రి ఆరోగ్యం బాగయేవరకూ, ఆయన దగ్గర వుండి సేవచేయాలనే పితృభక్తి వున్న వాడు. అలాంటివాడు మామగారి ద్వారా కలిసివచ్చిన ఆస్తితో, ఏనాటికైనా చంద్ర కాంతుణ్ణి మించిన వైభవంతో బతక గలడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# స్నేహధర్మం

నాగపట్టణంలోని రత్న వ్యాపారులందరిలోనూ దేవగుప్తుడు గొప్ప ధనికుడు. అతడు బాల్యంలో నాగపట్టణ రాజైన విజయశీలుడితో పాటు, ఒకే గురుకులంలో విద్యాభ్యాసం చేశాడు. ఆ కారణంవల్ల విజయశీలుడు రాజయాక కూడా, దేవగుప్తుడు ఆయనతో గాఢమైన స్నేహసంబంధాలు కలిగివుండేవాడు.

దేవగుప్తుడికి ఓడ వర్తకం వుండేది. అతడు తరచు వర్తకపు పనుల మీద అనేక ప్రాంతాలు తిరిగి వస్తూండేవాడు. ఒకసారి అతడు ఓడ ప్రయాణం తలపెట్టి, బయలుదేరేముందు రాజును చూడబోయాడు.

విజయశీలుడు అతణ్ణి ఎంతో ఆదరపూర్వకంగా పలకరించి, సంగతి తెలుసుకుని, "ఈ సముద్ర ప్రయాణాలు ఎంతో శ్రమతో కూడినవి. మనం దాదాపు వృద్ధులం అయిపోయినట్టే. ఈ పనుల భారం నీ కొడుకు మీద పెట్టి, నువ్వెందుకు విశ్రాంతి తీసుకోకూడదు?" అని అడిగాడు.

"మహారాజా, వ్యాపారం నిమిత్తం యిప్పుడు నేను చేయబోయేది, నా కడసారి ప్రయాణం. వెంట, నా కొడుకును కూడా తీసుకుపోతున్నాను. వాడికి వృత్తి పట్ల తగినంత ఉత్సాహం వున్నదిగాని, చాలినంత అనుభవం మాత్రం లేదు. ఈ ప్రయాణం వాడికి చాలా మేలు కలిగిస్తుందని నేను భావిస్తున్నాను. ఆ తరవాత మీరన్నట్టు, నేను పూర్తిగా విశ్రాంతి తీసుకోదలిచాను," అన్నాడు దేవగుప్తుడు.

అతడు రాజు దగ్గిర సెలవు తీసుకుని, కొడుకుతోపాటు ఓడల్లో ప్రయాణించి, అనేక దీవుల్లో లాభసాటిగా వస్తువుల కొనుగోలూ, అమ్మకాలూ చేసి, సంవత్సరం

మెడికో కృష్ణసుబ్బారావు

తరవాత నగరానికి తిరిగి వచ్చాడు. ఈ మధ్య కాలంలో రాజు విజయశీలుడు మరణించి, ఆయన కొడుకు జయశీలుడు రాజయ్యాడు.

దేవగుప్తుడు తన బాల్యమిత్రుడైన రాజు మరణానికి చాలా విచారించాడు. కొత్త రాజైన జయశీలుడి పాలనలో వచ్చిన మార్పులు గ్రహించడానికి ఆయనకు ఎంతో కాలం పట్టలేదు. రాజ కుటుంబానికి ఆప్తుడుగనక దేవగుప్తుడు, కొత్త రాజును చూడబోయాడు.

కుశల ప్రశ్నలయాక జయశీలుడు, దేవగుప్తుణ్ణి తన పరిపాలన ఎలా వున్నదని అడిగాడు. దానికి దేవగుప్తుడు, "చాలా బావుంది! కొద్దిమంది రాజోద్యోగుల పుణ్యమా అని, వ్యాపారస్థులు, మీ తండ్రిగారి కాలంలో ఒక్క దీనారం మాత్రమే లాభమార్జించగలిగిన సరుకుపై సైతం, యిప్పుడు పది దీనారాలు ఆర్జించగలుగుతున్నారు. రక్షకభటులకు ఆ కాలంలో నేరస్థులు మాత్రమే భయపడేవారు; ఇప్పుడు పౌరులందరూ వాళ్ళంటే భయకంపితులవుతున్నారు. ఇక ఆనాడు దైవదర్శనానికే ముడుపు చెల్లించి, మా పిసినారితనాన్ని చాటుకున్నాం. కాని, నేడు రాజుకూ, దైవానికీ తేడా లేదని ప్రజలను నమ్మించడంలో, మీ ద్వారపాలకులు విజయం సాధించారు," అన్నాడు.

ఈ జవాబుతో జయశీలుడికి, రాజోద్యోగులు వ్యాపారుల నుంచి లంచాలు గుంజుతున్నారనీ, రక్షకభటులు ప్రజలను పీడిస్తున్నారనీ తనను చూడవచ్చినవారి దగ్గిర ద్వారపాలకులు మామూళ్ళు వసూలు చేస్తున్నారనీ అర్థమైంది.

ఆయన దేవగుప్తుడికి తన కృతజ్ఞతలు చెప్పుకుని, నెల తిరక్కుండానే అవినీతిపరులను ఉద్యోగాల నుంచి తొలగించి, ప్రజల అభిమానం చూరగొన్నాడు.

దేవగుప్తుడు రాజకుటుంబంతో తనకు గల స్నేహధర్మం నెరవేరినందుకు చాలా సంతోషించాడు.






కోసలదేశంలో సమరపుంగవు డనేవాడు, దేహవిద్యలైన మల్లయుద్ధం, ముష్టియుద్ధం వంటి వాటిల్లో సాటిలేని ప్రావీణ్యం సంపాయించాడు. అతడు కోసలదేశం లోనే కాక, చుట్టుపక్కల రాజ్యాలలో కూడా తనకు దీటైన ప్రత్యర్థులే లేరని పించుకున్నాడు.

సమరపుంగవుడికి ఒక్కొక్కసారి తన చేత ఓటుపడిన మల్లులను గురించి ఆశ్చర్యం కలుగుతూండేది. వాళ్ళల్లో కొందరు దేహబలంలో తనకన్న మిన్న అయినవాళ్ళు; మరి కొందరు మల్లయుద్ధ రహస్యాలు ఆకళించుకున్న నిపుణులు. అయినా వాళ్ళు తనవల్ల అపజయం పాలవుతున్నారంటే, అందుకు కారణం వాళ్ళు తనకు సరయిన ప్రత్యర్థులు కాదన్న నమ్మకం కలిగింది, సమర పుంగవుడికి.

ఒకసారి అతడు తన గురువైన అజిత మల్లుడితో మాటలసందర్భంలో, "గురు వర్యా, నేనెందరో మల్లులను సునాయా సంగా ఓడించాను. అయినా ఇదేమీ నాకు గర్వకారణంగా కనిపించడం లేదు. ఎందుకంటే వాళ్లంతా నాకు సరి అయిన ఉజ్జీలు కాదని, నా నమ్మకం," అన్నాడు.

ఆ మాటలకు అజితమల్లుడు నవ్వి, "ముఖ్యంగా మల్లయుద్ధం లాంటి వాటిల్లో, మనిషికి ఒక్క దేహబలమే చాలదు, ఇతరశక్తులు కూడా వుండాలి!" అన్నాడు.

అవేమిటో వివరంగా చెప్పమని సమర పుంగవుడు అడిగాడు. కాని, అజిత మల్లుడు, "సమయం వచ్చినప్పుడు, అవేమిటో నీకే తెలుస్తుంది," అని వూరు కున్నాడు.



కొన్నాళ్ళ తరవాత సమరపుంగవుడు తనతో సరితూగగల ప్రత్యర్థి ఎక్కడైనా వున్నాడేమో చూడాలనుకుని, దేశాలు గాలిస్తూ తిరగసాగాడు.

కొంత కాలానికి అతడు అస్మకరాజ్యం చేరి, ఒక కొండమార్గాన నడుస్తూండగా నికుంభు డనే భయంకర రాక్షసుడు తటస్థపడ్డాడు.

మహాకాయుడైన యీ రాక్షసుడు ఒక కొండ గుహలో నివసిస్తూ, ఆకలయినప్పుడల్లా గ్రామాల మీదపడి మనుషులనూ, పెంపుడు జంతువులనూ పట్టుకు తింటూండాడు. అస్మకరాజైన అఖిలుడు రాక్షసుణ్ణి చంపేందుకు అనేకసార్లు సైనికులను వాడి మీదికి పంపాడు. కాని, నికుంభుడు ఎంతమంది సైనికులు తన మీదికి ఆయుధాలెత్తి లంఘించి వస్తున్నా ఏమాత్రం లెక్కచేయక, ఒక్కసారి పెద్దగా పెడబొబ్బ పెట్టేవాడు. ఆ వెంటనే సైనికులు ప్రాణభయంతో చెల్లాచెదురై పారిపోయేవారు.

ఈ నికుంభుణ్ణి చూడగానే సమరపుంగవుడిలో ఏదో కొత్త ఉత్సాహం వచ్చినట్టయింది. అతడు తొడచరిచి పెద్దగా ఒక కేక పెట్టాడు. రాక్షసుడు ఒక్క క్షణం నివ్వెరపోతూ సమరపుంగవుడి కేసి చూసి, తానూ ఒక పెడబొబ్బపెట్టాడు. వాడికి ఒక మనిషి తననిలా ఎదిరించ రావడం చూసి ఆశ్చర్యంతోపాటు, కొద్దిగా భయం కూడా కలిగింది.

సమరపుంగవుడు కుప్పించి దూకుతూ, రాక్షసుణ్ణి సమీపించేంతలో, అతడి కాలు తగిలి అసనాటుగా వున్న ఒక బండరాయి రాక్షసుడి కేసి దొర్లింది. దాన్ని తప్పుకునేందుకు రాక్షసుడు పక్కకు తొలిగేంతలో సమరపుంగవుడు వాడి మీదికి లంఘించి, ఒక్క ముష్టిఘాతంతో నేలపడగొట్టాడు.

సమరపుంగవుడి దెబ్బకు దిమ్మరపోయిన రాక్షసుడు తిరిగి కోలుకుని లేవబోయేంతలో, అతడు వాణ్ణి కాళ్ళతో, చేతులతో బలంగా కొట్టసాగాడు.

ఇద్దరి మధ్యా కొంతసేపు తీవ్రమైన పోరాటం జరిగాక, సమరపుంగవుడి చేతిలో రాక్షసుడు మరణించాడు. కాని, సమరపుంగవుడు కూడా రాక్షసుడి చేతిలో తీవ్రంగా గాయపడి సొమ్మసిల్లి కిందపడిపోయాడు.

దూరాన్నుంచి యిది చూసిన రాజుగారి చారులిద్దరు పరుగు, పరుగున రాజు అఖిలుడి వద్దకుపోయి జరిగిన సంగతి చెప్పారు. రాక్షసుడి పీడ విరగడయిపోయిందన్న సంతోషంతో ఆయన చిన్నగా మందహాసం చేసి, ఆ మరుక్షణంలోనే ఆందోళనపడుతూ మంత్రితో, ''నికుంభ రాక్షసుణ్ణి చంపినవాడు తగిలిన గాయాల నుంచి కోలుకోకముందే, మనం అతణ్ణి తుదముట్టించాలి. వెంటనే బయలుదేరండి,'' అన్నాడు.

నికుంభుడులాంటి భయంకర రాక్షసుణ్ణి చంపి దేశానికి ఎంతో మేలు చేసినవాణ్ణి రాజు ఎందుకు హతమార్చజూస్తున్నాడో, మంత్రికి అర్థం కాలేదు.

రాజూ, మంత్రీ కొద్దిమంది సైనికులు వెంటరాగా కొండల ప్రాంతానికి వెళ్ళేసరికి, చాలామంది ప్రజలు సమరపుంగవుడి చుట్టూ గుమిగూడి వున్నారు. వాళ్ళల్లో కొందరు ఎంతో భక్తి శ్రద్ధలతో అతడి గాయాలకు మందులు పూసి కట్లు కడుతున్నారు.

రాజు అఖిలుడు యిది చూసి, తన కత్తిని నేలకు జార్చి సమరపుంగవుడికి



నమస్కరిస్తూ, "నికుంభుడంతటి రాక్షసుణ్ణి చంపిన మీరు, వాడికన్న భయంకరులై వుంటారనుకున్నాను. అంతేకాక ఒక పీడ విరగడయి, అంతకన్న పెద్ద పీడ రాజ్యానికి దాపురిస్తున్నదని భ్రమపడ్డాను. గాయాల బాధ నుంచి తిరిగి కోల్కొనకముందే మిమ్మల్ని చంపాలన్న తలంపుతో వచ్చినందుకు సిగ్గుపడుతున్నాను," అన్నాడు.

"ప్రజాక్షేమం కోరే, ఏ పరిపాలకుడికైనా అలాంటి ఆలోచనే కలుగుతుంది. అందులో పెద్ద తప్పేంలేదు, మహారాజా!" అన్నాడు సమరపుంగవుడు.

ఆ జవాబుకు రాజు తృప్తిపడి, "మీరు దైవాంశకలవారో లేక అతీతశక్తులున్నవారో అయివుండాలి. నేను పంపిన పెద్ద, పెద్ద సైన్యాలనే నికుంభుడు తన హుంకారంతో హడలకొట్టి తరిమివేసేవాడు!" అన్నాడు.

"నాలో మీరు అనుకునే విధంగా దైవాంశగానీ, అతీతశక్తులు లాంటివిగానీ ఏమీ లేవు. దేహబలానికి తోడు యితర శక్తులు కావాలన్న మా గురువుగారి మాటల అంతర్యం యిప్పుడు నాకు బాగా అర్థమైంది. ఆ శక్తులు మనోదారుఢ్యం, ఆత్మవిశ్వాసం, పట్టుదల! అందువల్లనే, నాకు రాక్షసుణ్ణి చూసి నప్పుడు, మల్ల యుద్ధానికి నాకు సరి అయిన ఉజ్జీ దొరికాడన్న భావం తప్ప, వాడు రాక్షసుడన్న భీతి ఏమాత్రం కలగలేదు. మీ సైనికులు అలా కాక మొదటి నుంచీ వాడు భయంకరుడైన రాక్షసుడన్న భీతిలో మునిగివున్నారు," అన్నాడు సమరపుంగవుడు.

రాజుకు అంత మహామల్లుడైన సమరపుంగవుడి వినయం చూసి చాలా ఆనందం కలిగింది.

ఆయన సమరపుంగవుణ్ణి అప్పటికప్పుడే రాజలాంఛనాలతో నగరానికి తీసుకుపోయి ఘనంగా సత్కరించి, కొంత కాలం తరవాత గొప్ప బహుమతులిచ్చి, స్వదేశానికి పంపించాడు.





# కర్మ పరిపాకం

బుద్ధభగవానుడి కాలంలో అనాథపిండకు డనే వైశ్యోత్తము డుండేవాడు. ఆయనకు బుద్ధుడి యందు అపారమైన భక్తి. ఆయన జేతవనంలో యాభైనాలుగు కోట్లు ఖర్చు చేసి గొప్ప ఆరామం కట్టించాడు. ఆయన విధిగా రోజుకు మూడు సార్లు బుద్ధభగవానుణ్ణి చూసి వచ్చేవాడు. ఎప్పుడైనా బుద్ధుడే తన అనుచరులతో సహా ఆయన ఇంటికి భిక్షకై రావటం కూడా జరుగుతూండేది.

ఈ అనాథపిండకుడికి ఏడంతస్తుల మేడ ఉన్నది. దానికి ఏడు ప్రాకారాలు. వాటిలో మధ్య ప్రాకారం మీద ఒక క్షుద్ర దేవత తన సంతానంతో సహా నివాసం ఉంటూ ఉండేది. ఈ దేవతకు బుద్ధుడంటే బొత్తిగా పడదు. ఆయన తాను ఉండే ఇంటికి అప్పుడప్పుడూ వస్తూండటం ఆ దేవతకు ఎంతమాత్రం నచ్చలేదు. ఆమె మానవ స్త్రీరూపం ధరించి అనాథపిండకుడి ఖజానాదారు వద్దకు వెళ్ళి, "ఈ ఇంటికి బుద్ధుణ్ణి ఎందుకు రానిస్తారు? అటువంటివాడు గడపలో అడుగు పెట్టడం ఇంటికి చెరుపు!" అన్నది. ఖజానాదారు ఆమెను తిట్టి పంపాడు. తరవాత ఆమె అనాథపిండకుడి కొడుకు దగ్గిరికి వెళ్ళి, అదే విధంగా మాట్లాడి, అతనిచేత కూడా తిట్లు తిన్నది. చేసేదిలేక, అప్పటికా క్షుద్రదేవత ఊరుకున్నది.

అనాథపిండకుడికి ఖర్చు నానాటికీ హెచ్చిపోయి, రాబడి తగ్గిపోతున్నది. ఆయన వ్యాపారం ఏమాత్రమూ చూడటం లేదు. ఇది కూడా గాక ఆయనకు ఇతరత్రా నష్టం కలిగింది. సాటి వ్యాపారస్థులు ఆయనవద్ద పద్దెనిమిది కోట్ల సొమ్ము అప్పుగా పుచ్చుకున్నారు. దానిని

వాళ్ళు తిరిగి ఇవ్వలేదు, ఆయన అడగనూ లేదు. మరొక పద్దెనిమిది కోట్ల ధనం బిందెలలో అచిరవతీ నదీ తీరాన పాతి పెట్టిస్తే, నదికి వరదలు వచ్చి ఒడ్లు కరిగి, ఆ బిందెలు కాస్తా సముద్రంలోకి కొట్టుకు పోయాయి.

వీటి ఫలితంగా అనాథపిండకుడు పేదవాడైపోయాడు. ఆయన భిక్షువుల కింకా భోజనాలు పెడుతూనే ఉన్నాడు గాని, వెనకటి విందు లిప్పుడులేవు.

ఒకనాడు బుద్ధభగవానుడు అనాథ పిండకుడితో, ''ఇంకా దానాలు చేస్తూనే ఉన్నావా ?'' అని అడిగాడు.

అనాథపిండకుడు ఎంతో ఆవేదన పడుతూ, ''స్వామీ, దానాలైతే చేస్తూనే ఉన్నాను గాని, నేనిప్పుడు దానం చేసేది గంజి మాత్రమే !'' అన్నాడు.

బుద్ధు డాయన బాధ గమనించి, ''విచారించకు, నాయనా! హృదయం మంచిదిగా ఉన్నంత కాలమూ, చేసే దానం గంజే అయినా కూడా అది తప్ప కుండా మంచిదిగానే ఉంటుంది,'' అన్నాడు ఓదార్పుగా.

అనాథపిండకుడు పేదవాడైపోయాడు గనక ఇప్పుడు క్షుద్రదేవత ధైర్యంగా ఆయనవద్దకే వెళ్ళి, ''ఏమయ్యా, ఈ బుద్ధుణ్ణి ఎందుకు చేరనిస్తావు ? హాయిగా నీ వ్యాపారం చూసుకో. పోయిన డబ్బంతా తిరిగి సంపాదించుకో. నేను మీ యింటి నాలుగో ప్రాకారం మీద ఉండే



దేవతను. నీ మంచి కోరి చెబుతున్నాను,'' అన్నది.

అనాథపిండకుడు ఆమెతో, ''తక్షణం నా యిల్లు వదిలి వెళ్ళిపో,'' అన్నాడు కోపంగా.

''పోక కూర్చుంటాననుకున్నావా ఏమిటి? ఇంతకన్న మంచి ఇళ్ళే దొరుకుతాయి!'' అంటూ ఆ క్షుద్రదేవత అప్పటికప్పుడే తన పిల్లల మూకను వెంటబెట్టుకుని అనాథపిండకుడి ఇల్లు విడిచి వెళ్ళిపోయింది.

కాని ఆమె ఎంత వెతికినా అంత మంచి ఇల్లు మరొకటి దొరకలేదు. అటువంటి ఇల్లు వదిలినందుకు ఆమెకు పశ్చాత్తాపం కలిగింది. కాని విడిచి వచ్చిన ఇంటికి తిరిగి ఏ ముఖం పెట్టుకుపోవాలో తెలియక, ఆమె గ్రామదేవత సలహా కోసమై వెళ్ళింది.

''ఆ ఇల్లు విడిచి రావడం నీదే పొరపాటు. మళ్ళీ అక్కడికి వెళ్ళాలంటే ఒక పని చెయ్యి. అనాథపిండకుడికి వర్తకులు పద్దెనిమిది కోట్లు బాకీ ఉన్నారు. నువు అతడి గుమాస్తా రూపంలో వర్తకుల వద్దకు వెళ్ళి ఆ పద్దెనిమిది కోట్లూ వసూలు చెయ్యి. అనాథపిండకుడి ధనపు బిందెలు పద్దెనిమిది కోట్ల ధనంతో సహా సముద్రం చేరాయి. వాటిని తీసుకురా, ఫలాని చోట అనాథపిండకుడికి పద్దెనిమిది కోట్ల విలువ చేసే ఆస్తి ఉన్నది. ఈ సంగతి ఎవ్వరికీ తెలియదు. ఆ ఆస్తిని అనాథపిండకుడి



పరం చెయ్యి, ఆ తరవాత ఆయన వద్దకు వెళ్ళి క్షమాపణ చెప్పుకుని, తిరిగి రానిమ్మని అడుగు," అని గ్రామదేవత సలహా ఇచ్చింది.

క్షుద్రదేవత ఆ ప్రకారమే లోకు లివ్వవలిసిన పద్దెనిమిది కోట్లూ వసూలు చేసింది. సముద్రంలోని ధనపుబిందెలను తెచ్చింది. వాటితోబాటు పద్దెనిమిది కోట్లు విలువచేసే ఆస్తిని కూడా అనాథపిండకుడికిచ్చి, "బాబూ, నాకు బుద్ధి వచ్చింది. నన్ను క్షమించి, మళ్ళీ మీ ఇంట ఉండనివ్వండి," అని బతిమాలింది.

"ఈ క్షమాపణ బుద్ధభగవానుడి ఎదట చెప్పుకో!" అన్నాడు అనాథపిండకుడు క్షుద్రదేవతతో. ఆమె అనాథపిందకుడి వెంట జేతవనానికి వెళ్ళి, బుద్ధుడి ఎదట జరిగినదంతా చెప్పుకుని క్షమాపణ వేడింది.

అంతా విని బుద్ధభగవానుడీ విధంగా అన్నాడు:

"దుష్కర్మ చేసేవాడు తన కర్మ పరిపక్వమయేదాకా తాను మంచి పనే చేస్తున్నాననుకుంటాడు. ఫలితం అనుభవించవలిసి వచ్చినప్పుడు గాని నిజం బోధపడదు. అదే విధంగా సత్కర్మ చేసేవాడు కూడా తన కర్మ పరిపక్వం చెందేదాకా తాను చేస్తున్నది దుష్కర్మ అనే అనుకోవచ్చు. అతనికి కూడా ఫలం అనుభవించేటప్పుడే నిజం తెలిసివస్తుంది. మొదట చెప్పిన మాటకు ఈ క్షుద్రదేవతే నిదర్శనం. ఈమె తాను చాలామంచి పని చేస్తున్నాననుకున్నది. రెండవదానికి నిదర్శనం ఈ అనాథపిండకుడు. ఈయన తాను చెడ్డపని చేస్తున్నాననుకుంటూ ఎంతగానో విచారించాడు. కర్మపరిపాకం అయాకనే, ఇప్పుడు ఎవరిది సత్కర్మో, ఎవరిది దుష్కర్మో బయటపడింది!"

ఈ మాటలు విన్నమీదట క్షుద్రదేవత తన బుద్ధి మార్చుకుని, బుద్ధుడి యందు ద్వేషం విసర్జించి, గంపెడు పిల్లలతో సహా అనాథపిండకుడి ఇంటి నాలుగవ ప్రహరీ వద్ద యథాప్రకారం నివాసం చేయసాగింది.






## హుమయూన్-షేర్షా

బాబర్ అనంతరం అతని కుమారుడు హుమయూన్ 1530వ సంవత్సరం తన ఇరవైమూడో యేట, ఆగ్రా రాజధానిగా గల మొగల్ సామ్రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతడు భోగలాలసుడూ, కళాప్రియుడూ కావడం వల్ల తన తండ్రి స్థాపించిన సామ్రాజ్యాన్ని పటిష్ఠం చేయడానికి ఆసక్తి చూపలేదు.

ఆ సమయంలోనే ఆఫ్ఘన్ షేర్షా భారత దేశంలో శక్తివంతమైన రాజుగా బలపడసాగాడు. బీహార్‌లోని శశారం జాగీరుదారు కుమారుడైన షేర్షా అసలు పేరు ఫరీద్. బాల్యంలో తన సవతి తల్లిచేత అవమానించబడి, జాన్‌పూర్‌కు పారిపోయాడు.






ఫరీద్ యువకుడుగా ఉన్నప్పుడు ఒకసారి ఒంటరిగా పులిని ఎదుర్కొని దానితో పోరాడి హతమార్చాడు. ఆ యువకుడు ప్రదర్శించిన సాహసాన్ని చూసి ముగ్ధుడైన బీహార్ సుల్తాన్ అతనికి షేర్షా అని బిరుదునిచ్చి గౌరవించాడు. షెర్షా సైనిక విధానంలోనూ, ఎత్తుకు పైఎత్తు వేయడంలోనూ బాబర్‌ను ఆదర్శంగా తీసుకుని కృషి చేశాడు.



రకరకాల వ్యూహాలు పన్ని అచిర కాలంలో షేర్షా బీహార్ పాలకుడయ్యాడు. రోజు రోజుకూ ఎక్కువై పోతూన్న షేర్షా ఒత్తిడిని హుమయూన్ ఎదుర్కోవలసి వచ్చింది. ఎన్నో యుద్ధాలు జరిగాయి. యుద్ధం పట్ల వున్న అనాసక్తి కారణంగా దాదాపు అన్ని యుద్ధాల లోనూ హుమయూన్ ఓడిపోయాడు.

ఒకసారి యుద్ధంలో షేర్షా సైన్యం బారి నుంచి తప్పించుకోడానికి హుమయూన్, అతని సైనికులూ గంగానదిలో దూకి పారిపోవలసివచ్చింది. వందలాదిమంది ప్రవాహంలో కొట్టుకుపోయారు. హుమయూన్ కూడా మంచి ఈతగాడు కాక పోవడం వల్ల ప్రాణాపాయం కల్గే పరిస్థితి ఏర్పడింది.






ప్రవాహానికి తట్టుకోలేక కొట్టిమిట్టాడు తున్న హుమయూన్‌ను నీళ్ళుమోసే వాడొకడు చూసి, తన దగ్గరున్న తోలు సంచినిండా గాలినింపి గంగానదిలోకి వదిలి దాని ద్వారా హుమయూన్‌ను గట్టెక్కించాడు. ఆ విధంగా రాజుగారి ప్రాణాలను ఒక సామాన్యుడు కాపాడ గల్గాడు.



ప్రాణాలను కాపాడిన వానికి కృతజ్ఞతలు తెలియజేసే రీతిలో హుమయూన్ అతణ్ణి ఒక రోజంతా తన సింహాసనం మీద కూర్చోబెట్టాడు. వాడు తన అధికారానికి గుర్తింపుగా తన తోలు సంచీని ముక్కలుగా చించి, వాటిని తన జీవితంలో మరువలేని రోజుకు జ్ఞాపకచిహ్నాలుగా మిత్రులకు పంచిపెట్టాడు.

తన సింహాసనాన్ని రక్షించుకోడానికి హుమయూన్ చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. చివరికి శత్రువుల దాడికి తట్టుకోలేక ఉమరుకోట్ లోని ఒక హైందవ రాజు ఇంట తలదాచుకోవలసి వచ్చింది. ఆ సమయంలోనే హుమయూన్‌కు తన రాణి బేగం హమీదా బాను వల్ల అక్బర్ జన్మించాడు.





ఢిల్లీని ఆక్రమించుకున్న షేర్షా క్రమంగా ఉత్తర భారతదేశాన్నీ, తూర్పు భారత ప్రాంతాలను తన అధికారంలోకి తెచ్చుకున్నాడు. అధికారాన్ని సుస్థిరం చేసుకున్న తర్వాత, సూర్ వంశానికి చెందిన షేర్షా పరిపాలనా విధానంలో అనేక సంస్కరణలు ప్రవేశపెట్టి, సమర్థుడూ, ఆదర్శవంతమైన పాలకుడూ అని పేరు గాంచాడు.

షేర్‌ఖాన్‌గా పేరు మార్చుకున్న షేర్షా రాజపుత్రులతో ఎన్నో యుద్ధాలు చేశాడు. కాలింజర్ కోట సమీపాన యుద్ధం జరుగుతున్నప్పుడు ఒకసారి తుపాకీ మందు వున్న గిడ్డంగికి నిప్పంటుకుంది. ఆ సమయాన దాని సమీపంలో వున్న షేర్షా గాయపడి మరణించాడు.





షేర్షా మరణం, ఆ తర్వాత ఏర్పడిన అస్తవ్యస్త పరిస్థితి గురించి కాందహార్‌లో వున్న హుమయూన్ విన్నాడు. అదే అదనుగా భావించి, భారతదేశానికి వచ్చి పదిహేను సంవత్సరాల క్రితం పోగొట్టుకున్న రాజ్యాధికారాన్ని మళ్ళీ వశపరుచుకోవడానికి పూనుకున్నాడు. ఆనాటికి క్రమశిక్షణతో జాగ్రత్తగా ఎలా మసలుకోవాలో, బాగా గ్రహించాడు హుమయూన్.

1555 వ సంవత్సరం లాహోర్, ఆగ్రా- ఢిల్లీ ప్రాంతాలను సులభంగా ఆక్రమించుకుని హుమయూన్ మొగల్ పరిపాలనను భారత దేశంలో మళ్ళీ స్థాపించాడు. కాని అతడు నూతన రాజ్యవైభవాన్ని ఒక యేడాదిపాటైనా అనుభవించలేక పోయాడు. తన భవనంలో వున్న గ్రంథాలయం మేడ మెట్లెక్కుతూ జారిపడి, 1556 వ సంవత్సరంలో మరణించాడు.






# చూపు ఆనని వాళ్ళు

ఒక ఊళ్ళో ముగ్గురు అన్నదమ్ములు పక్క పక్క ఇళ్ళల్లో నివసిస్తూండే వాళ్ళు. ఆ ముగ్గురికీ అపరిమితమైన చత్వారం; ఏ వస్తువైనా ముక్కు దగ్గిర పెట్టుకుంటే గాని కనిపించేది కాదు.

ఆ అన్నదమ్ములు ముగ్గురూ ఒకనాటి సాయంకాలం పెద్దవాడి ఇంట కలుసుకుని లోకాభిరామాయణం మాట్లాడుతున్నారు. మధ్యలో పెద్దవాడు తన తమ్ములతో, "అన్నట్టు, ఈ మధ్య నా చూపు చాలా బాగయింది సుమా. అంత దూరాన దోమ కనిపిస్తే అది ఆడదో మగదో పోల్చ గలుగుతున్నాననుకోండి," అన్నాడు.

"చాల్లే నీ బడాయిలు! వారం క్రితమేగా నువు పట్టపగలు కావడివాడి పైన పడిందీ?" అన్నాడు రెండోవాడు.

"పగలు మాట అటుంచు. చీకటి పడిన కొద్దీ అద్భుతంగా చూపు అనుతున్నది. కొందరికి రాత్రిచూపు ఉంటుందట," అన్నాడు పెద్దవాడు.

"ఇవన్నీ ఎందుకొచ్చిన కబుర్లు? తింటేగాని రుచి తెలియదు. ఎవరి చూపు ఎటువంటిదో పరీక్ష పెడితే క్షణంలో తేలిపోతుంది," అన్నాడు మూడోవాడు.

"ఏమిటా పరీక్ష?" అన్నాడు రెండోవాడు.

"చెబుతాను వినండి. మన వీధి కెదురుగా సత్రం వాకిలి ఉన్నదే, ఆ వాకిలి పైన రేపు ఉదయం ధర్మశాసనం శిల వేయిస్తున్నారు. ఆ శిల పైన ఏమి చెక్కి ఉన్నదో చదవటమే మనకు పరీక్ష. దానిమీది అక్షరాలను మనలో ఎవరు ఎక్కువ దగ్గిరగా నిలబడి చదవగలిగితే వాడు ఓడినట్టు. మిగిలిన ఇద్దరికీ ఓడినవాడు భోజనం పెట్టేటట్టు పందెం!" అన్నాడు మూడోవాడు.



దీనికి పెద్దవాళ్ళిద్దరూ సరే నన్నారు. చిన్నవాళ్ళు తమ ఇళ్ళకు వెళ్ళిపోయాక పెద్దవాడికి బెంగ పట్టుకున్నది. కారణం: ఆ శాసనాన్ని ముక్కుతో తాకిగాని చదవలేడు.

ఈ సమస్య గురించి చాలాసేపు సతమతమైన మీదట పెద్దవాడికి దివ్యమైన ఆలోచన తట్టింది. సత్రంలో గుమాస్తా ఉంటాడు. ఆయన నడిగితే ఆ ధర్మ శాసనం పలక పైన ఏమున్నదీ చెప్పేస్తాడు. ఈ ఆలోచన తట్టగానే పెద్దవాడు బయలుదేరి సత్రానికి వెళ్ళాడు.

"ఏదో పనిమీద దయ చేశారు?" అన్నాడు సత్రం గుమాస్తా.

"మరేమీ లేదు. రేపు ధర్మశిల వేస్తున్నారటగా? దాని మీద ఏమి రాయించారేమిటి?" అన్నాడు పెద్దవాడు.

"ఏమీ లేదండీ. 'శ్రీరామ కటాక్షము' అని రాయించారు," అన్నాడు గుమాస్తా.

పెద్దవాడు ఆనందభరితుడై గుమాస్తా వద్ద సెలవు పుచ్చుకుని ఇంటికి బయలుదేరాడు. సత్రం వాకిలివద్దనే రెండోవాడు పెద్దవాడికి ఎదురువచ్చాడు. అయితే ఇద్దరూ చూపు అననివాళ్ళే గనక ఒకరి నొకరు గమనించలేదు.

పెద్దవాడికి వచ్చిన ఆలోచనే రెండో వాడికి వచ్చింది. ఆయన కూడా గుమాస్తా వద్దకు వెళ్ళి పెద్దవాడు అడిగినట్టే, ధర్మ శాసనం పైన ఏమి రాయించారని అడిగాడు. ప్రతివాళ్ళూ ఇదే సంగతి అడగటం చూసి ఆశ్చర్యపడుతూ గుమాస్తా పెద్దవాడికి చెప్పినట్టే జవాబు చెప్పాడు. రెండోవాడు అంతటితో తృప్తిపడి వెళ్లిపోక, "పలక ఏ రంగుది? అక్షరాలు ఏ రంగు?" అని అడిగాడు.

"తెల్లటి చలవరాతి పైన బంగారు చెక్కుడు అక్షరాలు," అన్నాడు గుమాస్తా.

రెండోవాడు వెళ్ళిన కాస్సేపటికి మూడోవాడు వచ్చి గుమాస్తాను మొదటివాడు అడిగినట్టే అడిగాడు. గుమాస్తా చెప్పాడు.

"'శ్రీరామ కటాక్షము' అన్నదాని కింద శాసనం వేయించే వారి పేరుచెక్కించ లేదా ఏం?" అన్నాడు మూడోవాడు.

"చిన్న అక్షరాలతో 'ఫలానావారు' అని చెక్కించారు. దానికి ఏ రంగు పూశారని అడుగుతారేమో! ఎర్రరంగు!" అన్నాడు గుమాస్తా నవ్వుతూ.

అన్నదమ్ములు ముగ్గురూ, "నేను గెలిచా!" అనుకుంటే, "నేను గెలిచా!" అనుకుని ఆ రాత్రి నిద్రపోయారు. తెల్ల వారగానే పెద్దవా డింటికి మిగిలిన వాళ్ళిద్దరూ వచ్చారు. ధర్మశాసనం చూడ బోదామని ముగ్గురికీ ఆత్రంగానే ఉంది. ఆలస్యం చేయకుండా ముగ్గురూ వీధిలోకి వచ్చారు. పెద్దవాడు చప్పున ఆగి సత్రం కేసి చూసి, "ఇంకా దగ్గిరికి పోవలసిన అవసరమేముందీ? శాసనం పలకమీది అక్షరాలు ఇక్కడికే కనిపిస్తున్నాయి. చదవనా? శ్రీరామ కటాక్షము," అన్నాడు.

ఈ మాటలు విని చిన్నవాళ్ళిద్దరూ నిర్ఘాంతపోయారు. ఒక క్షణంపాటు ఓడా మని భయపడ్డారు. కాని రెండోవాడు తెప్పరిల్లుకుని, "పలక ఏ రంగుది? అక్షరాలు ఏ రంగు?" అని అడిగాడు.

పెద్దవాడికి గోతిలో పడ్డట్టయింది. "రంగా, నీకు రంగు కనిపిస్తున్నదా ఏమిటి?" అన్నాడాయన రెండోవాడితో.




"స్పష్టంగావున్న రంగు కనిపించక పోవటమేమిటి? తెల్లటి పలక మీద బంగారు పూత పూసిన అందమైన చెక్కడు అక్షరాలు కన్పించటం లేదూ?" అన్నాడు రెండోవాడు.

"మీ రిద్దరూ ఎందుకు పోట్లాడు కుంటారు? ఆ పలక మీద చెక్క ఉన్న చిన్న అక్షరాలు చదవగలరేమో చూడండి. పెద్ద అక్షరాలు కబోది కూడా చదువు తుంది," అన్నాడు మూడోవాడు.

"పలక మీద చిన్న అక్షరాలు కూడా ఉన్నాయా?" అన్నారు పెద్దవాళ్ళిద్దరూ.

"కనిపిస్తూంటేనే! ఎర్రటి అక్షరాలు, 'ఫలానావారు' అని స్పష్టంగా రాసి

ఉంది! ఏమిటో అనుకున్నాను. మీ ఇద్దరి చూపుకంటె నాదే నయమే!'' అన్నాడు మూడోవాడు.

పెద్దవాడు తాను కూడా గెలిచినవాడితో చేరే ఉద్దేశంతో, ''నీ చూపే మన ముగ్గురిలోకీ మంచిది. తరవాత నా చూపు మంచిదంటాను. పెద్ద అక్షరాలు గుర్తించినది నేను కద! మీ రింకా ముందుకు పోబోతుంటే నేను ఇక్కడే ఆగాను! అందుచేత నీకూ నాకూ రెండోవాడు భోజనం పెట్టాలి,'' అన్నాడు. రెండోవాడు పేచీ పెట్టాడు. అక్షరాలు ఏ రంగో, పలక ఏ రంగో తెలునుకోలేనివాడు చూశాడంటే ఎలా నమ్మటం?

కాస్సేపు ముగ్గురూ ఘర్షణపడి ఎవరి తీర్పు అయినా తీసుకోవటానికి ఒప్పుకున్నారు.

ఇంతలో సత్రం గుమాస్తా అటుగా వచ్చాడు. ''అయ్యా, మీరెవరో కాస్త మాకు న్యాయం చెప్పండి. ఆ సత్రం ధర్మశాసనం మీద 'శ్రీరామకటాక్షము' అని రాసి ఉన్నమాట అబద్ధమా?'' అని పెద్దవాడు అడిగాడు.

''కాదు!'' అన్నాడు గుమాస్తా.

''పలక తెల్ల చలవరాయి అవునంటారా? దాని మీద బంగారు చెక్కుడు అక్షరాలేనంటారా?'' అన్నాడు రెండోవాడు.

''అవును!'' అన్నాడు గుమాస్తా.

''చిన్న అక్షరాలతో 'ఫలానా వారు' అని రాసి ఉన్న మాటా, అక్షరాలు ఎర్రగా ఉన్న మాటా నిజమే నంటారా?'' అన్నాడు మూడోవాడు.

''నిజమే!'' అన్నాడు గుమాస్తా.

మళ్ళీ అన్నదమ్ములు, ''నా చూపు మెరుగు!'' అంటే ''నా చూపు మెరుగు!'' అని తగాదా పడసాగారు.

సత్రం గుమాస్తా వారిని ఆపి, ''మెరుగో తరుగో గాని మీ ముగ్గురి చూపూ ఒకటిగానే ఉన్నదని నా ఉద్దేశం. ఎందుచేతనంటే సత్రం వాకిలికి ఇంకా ధర్మశాసనం పలక తగిలించలేదు!'' అంటూ తన దారిన తాను వెళ్ళిపోయాడు.








కోసలసామ్రాజ్యాన్ని రాజ్యవర్ధను డనే చక్రవర్తి పాలించే కాలంలో, ఆయన అధీనంలో కొన్ని సామంతరాజ్యాలుండేవి. అలాంటివాటిలో వింధ్య పర్వతాలకు దిగువ నున్న రత్నగిరిని ఆనందు డనే సామంతుడు పరిపాలిస్తూండేవాడు.

ఈ సామంతుడిది చాలా చిత్రమైన స్వభావం. పరిపాలన వ్యవహారాల్లో ఎలాంటి చిన్న సమస్య ఎదురైనా, త్వరపడి ఏదో ఒక నిర్ణయానికి వచ్చి, తరవాత చిక్కులపాలయ్యేవాడు.

ఒకసారి ఆనందుడికి రాజ్యపాలనా విషయాల్లో, తన ప్రధానమంత్రికి కొందరు సలహాదారులుండడం మేలనిపించింది. ఆయన ప్రధానమంత్రికి ఆ సంగతి గురించి చెప్పాడు. రాజు స్వభావం బాగా ఎరిగి వున్న ప్రధాన మంత్రికి సరేననక తప్పలేదు.

ఇద్దరితో ప్రారంభించి, [illegible] ముగిసే లోపల రాజు తన ప్రధానమంత్రికి పదిహేనుమంది సలహాదారులను నియమించాడు. రెండో నెల తిరక్కుండానే, మంత్రి మాటల సందర్భంలో రాజుతో, "ప్రభూ, ఇంతమంది సలహాదారులుండడంతో, ఎవరిసలహా తీసుకోవాలో అర్థం కావడం లేదు. పైగా, కోశాగారం నుంచి చాలా ధనం వాళ్ళ జీతాలకు ఖర్చవుతున్నది," అని చెప్పాడు.

వెంటనే రాజు సలహాదారులను పిలిపించి, వాళ్ళ హోదా తగ్గించి, గౌరవ వేతనం మీద వాళ్ళను నగరంలోని పేటలకు సలహా ప్రతినిధులుగా నియమించాడు. ఇందువల్ల, నగరంలో ప్రజల అవసరాలను త్వరగా తెలుసుకుని, వెంటనే పరిష్కరించవచ్చని ఆయన అభిప్రాయం.

పి. ఎం. పార్వతి



ఒకనాడు వర్తకుల పేటలోని సలహా దారు రాజు దగ్గిరకు వచ్చి, ఆ పేటలో దేవాలయం లేదనీ, వర్తకుల సౌకర్యం కోసం ఒక దేవాలయాన్ని నిర్మించాలనీ కోరాడు. కాని, మంత్రి కోశాగారంలో ధనం కొరతగా వున్నదన్నాడు.

రాజు, సలహాదారుతో, "ప్రస్తుతానికి ఆ వర్తకుల పేటలోని వాళ్ళను, రాజవీధి లోని దేవాలయంలో వారాని కొకరోజు పూజలు జరుపుకోమను. ఇలా వాళ్ళకు ఒక రోజు కేటాయించినట్టు పూజారికి వర్తమానం పంపుతాము," అన్నాడు.

వారం తిరిగేసరికి కమ్మరి, వడ్రంగి—యిలా వివిధ వృత్తులవాళ్ళూ, తమకు కూడా దేవాలయంలో పూజకు ఒక రోజు కేటాయించాలని, తమ పేట సలహాదారు ద్వారా, రాజుకు విన్నవించుకున్నారు. వారానికి ఏడు రోజులేకనక, యిన్ని వృత్తులవాళ్ళకు ఒక్కొక్క రోజు కేటా యించడం సాధ్యం కాదన్నాడు మంత్రి.

కాని రాజు, మంత్రిని అమాయకుడి కింద జమకట్టి, "ప్రజల కోర్కెను తృణీ కరించడం రాజైనవాడు చేయగూడని పని!" అన్నాడు కోపంగా.

మంత్రి నివ్వెరపడి, "ప్రభూ, వారానికి ఏడు రోజులేకదా!" అన్నాడు.

"ఆ సంగతి నాకు తెలియందికాదు. ఇకనుంచి వారానికి పది రోజులు!" అన్నాడు రాజు.

"తమ చిత్తం, ప్రభూ! కాని, వారంలో ఏడు రోజులకు మాత్రమే పేర్లున్నాయి. మిగిలిన మూడు రోజుల మాటేమిటి?" అన్నాడు మంత్రి.

"ఇదొక పెద్ద సమస్య కాదు. ఒక రోజుకు చక్రవర్తి పేరు పెడదాం, మరొక దానికి నా పేరు, మిగిలినదానికి నీ పేరు, సరా!" అన్నాడు రాజు.

ఇకపైన వారానికి పది రోజులన్న వార్త నగరంలో పాకిపోయింది. అది విని, నగరంలో కుబేరుడంతటి వాడని పేరు మోసిన వరహాలశెట్టి రాజు దగ్గిరకు వచ్చి,

"ప్రభూ, ధర్మకార్యాలకు తమకు డబ్బు అవసరం అనీ, కోశాగారంలో అంతగా డబ్బు లేదనీ తెలిసింది. తమకు లక్ష వరహాలు సమర్పించుకుంటాను. వారానికి పదకొండు రోజులుచేసి, దానికి నా పేరు పెట్టండి," అని వేడుకున్నాడు.

రాజు సంతోషించి, వారానికి పదకొండు రోజులని ప్రకటించి, ఆ రోజుకు వరహాల శెట్టి పేరు పెట్టాడు. ఇది నగరంలో అందరికీ నగుబాట్ల వ్యవహారంగా తోచింది. పొరుగున వున్న సామంతులు యిది అదనుగా తీసుకుని రత్నగిరి రాజ్యాన్ని కబళించేందుకు కుట్రలు పన్న సాగారు.

ఈ సంగతులన్నీ తన చారుల ద్వారా చక్రవర్తి రాజ్యవర్ధనుడు విన్నాడు. ఆయన తన సామంతుల మధ్య పోరు సామ్రాజ్యానికే హాని కలిగించగలదని గ్రహించి, వారినందరినీ రాజధానికి పిలిపించాడు.

రాజ్యవర్ధనుడు నిండు సభలో రత్నగిరి రాజు అనందుణ్ణి పరిపాలనా దక్షుడంటూ మెచ్చుకుని, "ఇలాంటి అనుభవశాలి నాకు సలహాదారుడు కావడం సామ్రాజ్యానికెంతో మేలుచేస్తుంది. ఆయన్ని నాకు సలహాదారుగా నియమిస్తున్నాను," అన్నాడు.

రాజ్యవర్ధనుడి మాటలకు ఒక్క రాజు అనందుడు తప్ప, తక్కినవారంతా విస్తుపోయారు. ఆయన అప్పటికప్పుడే అనందుడి కుమారుడైన సత్యదేవుణ్ణి రత్నగిరికి రాజుగా ప్రకటించాడు.

సామంతులంతా వెళ్ళిపోయాక రాజ్యవర్ధనుడు, సత్యదేవుడికి వీడ్కోలిచ్చే సమయంలో అతడితో, "నిన్ను రాజుగా చేసిన కారణం ఏమిటో గ్రహించే వుంటావు. నీ తండ్రి సలహాలతో నాకేం పని లేదు. ఆయన సలహాల బాధ నుంచి నీకు రక్షణ కల్పించేందుకే, ఆయన్ని ఆస్థానంలో వుంచుతున్నాను," అన్నాడు.

సత్యదేవుడు, రాజ్యవర్ధనుడికి తన కృతజ్ఞత చెప్పుకుని, రత్నగిరికి తిరిగిపోయి, అనుభవజ్ఞుడైన మంత్రి సహాయంతో రాజ్యపాలన చేస్తూ, కొద్ది కాలంలోనే మంచి సమర్థుడనిపించుకున్నాడు.





# మందబుద్ధి

వరాలయ్యకు పనివాడు లేనిదే క్షణం గడవదు. ఆయనది భారీ శరీరం. చేతిలోంచి ఏదైనా జారిపడితే, వంగి దాన్ని తీసుకునేందుకు నానా శ్రమా పడేవాడు. ఆయన బాగా డబ్బు గలవాడు కాబట్టి, ఎప్పుడూ తనవెంట వుండడానికి పనివాణ్ణి పెట్టుకోగలడు. అయితే, భారీ శరీరం, డబ్బుతోపాటు ఆయనకు కోపం కూడా చాలా ఎక్కువ. అందువల్ల ఎవ్వరూ ఆయన వద్ద నెలకుమించి పని చేయలేక పోయేవారు. ఆ నెల రోజులైనా ఎందుకంటే, జీతం కోసం! మొదటి నెల జీతం యిలా చేతికి అందగానే, అలా పని మానేసేవాళ్ళు చాలామంది.

దీనితో వరాలయ్య విసిగిపోయి, ఎవరైనా తన వద్ద ఆరునెలలు నాగా పెట్టకుండా పని చేస్తేనే, ఆరునెలల జీతం ఒక్కసారిగా యిస్తానన్నాడు. ఆ తరవాత ఆయనకు పనివాళ్ళు దొరకడం మరింత కష్టమయింది. ఆ పరిస్థితుల్లో మందబుద్ధి వరాలయ్య దగ్గిర పనికి కుదిరాడు.

మందబుద్ధికి నా అన్నవాళ్ళెవరూ లేరు. వాడి బుర్రలో తెలివి అంటూ లేనేలేదు. వాడికి దేనికీ కోపం రాదు. వరాలయ్య ఏం చెప్పినా, వెంటనే అక్షరాలా అదే విధంగా పనిచేసేవాడు. చాలాకాలానికి వరాలయ్యకు నచ్చిన పనివాడు దొరికాడు.

ఒకనాటి రాత్రి వరాలయ్య పడక గదిలో పడుకుని వుండగా, ఆయనకు నడవాలోని దీపం ఆర్పలేదేమో అన్న అనుమానం కలిగింది. వెంటనే ఆయన మందబుద్ధికి దీపం ఆర్పి రమ్మని చెప్పాడు. మందబుద్ధి నడవాలోకి వెళ్ళాడు. అంతవరకూ వెలుగుతున్న దీపం, వాడి దురదృష్టం కొద్దీ గాలికి అప్పుడే ఆరిపోయింది.

జొన్నలగడ్డ రామలక్ష్మి

వరాలయ్య తనను దీపం ఆర్పమని చెప్పాడు. ఆయన మాట అక్షరాలా పాటించవలసిందే కదా! ఇలా అనుకుని మందబుద్ధి పొరుగింటికి వెళ్ళి, అగ్గిపెట్టె అడిగాడు.

"మీ ఇంట్లో లేదా?" అని అడిగాడు పొరుగువాడు.

"ఉన్నది. కాని, ఎక్కడున్నదో చీకట్లో కనిపించడం లేదు," అన్నాడు మందబుద్ధి.

"మా ఇంట్లో వున్నది ఒక్కటే అగ్గిపెట్టె. ఏ రాత్రివేళ అవసరం కలుగుతుందో! నీతో వస్తా పద," అంటూ పొరుగువాడు వరాలయ్య ఇంటికి వచ్చాడు.



మందబుద్ధి దీపం వెలిగించి, వెంటనే ఆర్పివేసి, అగ్గిపెట్టెను పొరుగువాడికిస్తూ, "ఇక నువ్వు వెళ్ళవచ్చు," అన్నాడు.

పొరుగువాడు ఆశ్చర్యపోతూ, "ఈ మాత్రం దానికి దీపం వెలిగించడం ఎందుకు?" అన్నాడు.

"నా యజమాని నన్ను దీపం ఆర్పమన్నాడు. నేను ఆర్పేలోగానే అది ఆరిపోయింది. అందుకని మళ్ళీ వెలిగించి ఆర్పాను," అన్నాడు మందబుద్ధి.

ఆ జవాబుకు పొరుగువాడు నవ్వుకుని, వరాలయ్య వద్దకు వెళ్ళి, జరిగింది చెప్పి, "నీ పనివాడు చెప్పింది చెప్పినట్టు చెయ్యడమేగానీ, సొంతాన ఆలోచించడం తెలియని పరమ మూర్ఖుడు. వీడికి తెలివితేటలు నేర్పకపోతే, ఏదో ఒకనాడు నీకు చాలా పెద్ద ప్రమాదమే ఎదురవుతుంది," అని, వరాలయ్యకు రెండు పంచతంత్రం కథలు చెప్పాడు.

అవి వింటూనే వరాలయ్య భయపడ్డాడు. అయితే, మందబుద్ధి వంటి వినయగుణం కల పనివాణ్ణి వదులుకోవడం ఆయన కిష్టంలేదు. ఆయన బాగా ఆలోచించి మర్నాడే ఆ ఊరి బడిపంతుల్ని పిలిచి, రోజూ మందబుద్ధికి చదువు చెప్పమన్నాడు.

పంతులు చాలా మంచివాడు. ఆయన రోజూ వచ్చి మందబుద్ధికి శ్రద్ధగా చదువు చెప్పేవాడు. వాడికి ఏ విషయం ఎలా చెబితే అర్థమవుతుందో గమనించి, అలాగే బోధ చేసేవాడు. నెల రోజుల్లోనే మంద బుద్ధికి, బుద్ధి వికసించసాగింది.

మందబుద్ధిలో వచ్చిన మార్పుకు సంతోషించిన బడిపంతులు, వరాలయ్యతో, "వాడికి చెప్పవలసిన తీరులో చదువు చెప్పేందుకు ఎవ్వరూ ప్రయత్నించలేదు. ఆహాఁ, వాడు చాలా చురుకైనవాడు, తెలివైనవాడు!" అని మంద బుద్ధిని మెచ్చుకున్నాడు.

వరాలయ్య, మందబుద్ధి తెలివితేటల్ని పరీక్షించి, వాడిలో నిజంగానే మార్పు వచ్చిందని గ్రహించాడు. ఆయన బడి పంతులుకు మంచి బహుమానం యిచ్చి పంపాడు.

ఆ మర్నాటి నుంచీ మందబుద్ధి, వరాలయ్య చెప్పిన పనులు చెప్పినట్టు చేయడం మానేశాడు. ప్రతి పనికీ మంచి చెడ్డలు ఆలోచించి, ఈ పని చేయడం చెరుపు; ఫలాని పని చేయడంవల్ల మేలు కలుగుతుంది, అంటూ వరాలయ్యకు వివరించసాగాడు.

వరాలయ్య పరిస్థితి మళ్ళీ మొదటికి వచ్చింది. ఆయనకసలే కోపం ఎక్కువ.

"చిన్న చిన్న పనుల్లో నీ తెలివితేటలు ఉపయోగించు, కాదనను. కానీ, మిగతా విషయాల్లో మాత్రం నే చెప్పినట్టు



వినాలి! తెలిసిందా?'' అన్నాడు వరాలయ్య, మందబుద్ధితో.

''అదేం మాట! మీరు తప్పుచేస్తూంటే, చూస్తూ వూరుకోలేను. అది తప్పు అని చెప్పి తీరుతాను, మీ మంచికోసమే!'' అన్నాడు మందబుద్ధి.

''అయితే, నిన్ను పనిలోంచి తీసేశాను. తక్షణం యిక్కణ్ణించి కదులు,'' అన్నాడు వరాలయ్య కోపంగా.

''నాకు మీ దగ్గిరే బావుంది. ఇంకెక్కడికీ వెళ్ళను,'' అన్నాడు మందబుద్ధి.

ఇద్దరూ గ్రామన్యాయాధికారి దగ్గిరకు వెళ్ళి, జరిగింది చెప్పారు.

సాంతం విన్న న్యాయాధికారి మందబుద్ధితో, ''మందబుద్ధీ, నీకు వరాలయ్య ఎంతో మేలు చేశాడు. తన ఖర్చుతో నీకు తెలివితేటలు అబ్బేలా చేశాడు. అందుకు ఆయనకు నువ్వెంతో ఋణపడి వున్నావు,'' అన్నాడు.

దానికి మందబుద్ధి, ''అయ్యా, ఆయన నాకు చదువు చెప్పించి, బుద్ధివికసించేలా చేశాడు. అందువల్ల జరిగిన మేలేమిటి? ఆ బుద్ధి ఆయనకే పనికి రాక, నన్ను ఉద్యోగంలో నుంచి తీసివేస్తానంటున్నాడు. ఇక్కడ నాకు ఉద్యోగం పోతే, మరెవరు నన్ను పనిలో పెట్టుకుంటారు?'' అన్నాడు.

''వరాలయ్య చెప్పినట్టు వింటే, ఏ గొడవా వుండదు కదా?'' అన్నాడు న్యాయాధికారి.



"కాస్త తెలివంటూ వున్నవాడెవడూ, ఆయన మాట వినడు. నేనక్షరాలా ఆయన చెప్పినట్టు చేయాలంటే, మళ్లీ నన్ను మందబుద్ధిని చేయమనండి," అన్నాడు మందబుద్ధి.

వరాలయ్య పట్టరానికోపంతో చిందులు తొక్కుతూ, "ఒరే, నీకు తెలివితేటలు నేర్పిన పంతుల్ని పిలిపించి, నిన్ను తిరిగి మందబుద్ధిగా మార్చమంటాను," అన్నాడు.

మందబుద్ధి, న్యాయాధికారితో, "అయ్యా, విన్నారా! ఇప్పుడా పంతులు నాకు నేర్పిన తెలివితేటల్ని ఎలా తీసుకోగలడు? ఈయన యిలాంటి పనులే చెబుతూంటాడు," అన్నాడు.

న్యాయాధికారి వెంటనే, "వరాలయ్యా! నీ పనివాడు నీకు పనులు చేసేందుకే కాక, సలహాలిచ్చేందుక్కూడా అవసరం. వాణ్ణి, నువ్వు పనిలోంచి తీసెయ్యడానికి వీల్లేదు. అలా చేయదలిస్తే, వాడికి మరెక్కడైనా ఉద్యోగం చూపించు," అన్నాడు.

ఆ మాటలతో వరాలయ్య నీరసపడిపోయి, దిక్కులు చూడసాగాడు. అప్పుడు న్యాయాధికారి చిన్నగా నవ్వి, "వరాలయ్యా, మరీ అంతగా దిగాలుపడిపోకు. మంచి తెలివితేటలూ, చురుకుదనమూ, అణకువా వున్న వీణ్ణి, మందబుద్ధిగా నటించమని, నీ దగ్గరకు పంపినవాణ్ణి, నేనే! గ్రామంలో మోతుబరివి. ఒక్క మితిమీరిన కోపం తప్ప, అన్నిటా మంచివాడివి. పనివాళ్ల విషయంలో నానా గొడవా పడిపోతున్న నీకు, మంచి పనివాణ్ణి కుదిర్చిపెట్టే బాధ్యత నా పైన వేసుకున్నాను," అన్నాడు.

"అలాగా, చెప్పరేం మరి!" అని, వరాలయ్య తల తిప్పి మందబుద్ధి కేసి చూస్తూ, "మందబుద్ధిలా ఎంత చక్కగా నాటకం ఆడావురా! జరిగిందానికేం గాని, నా లాంటివాడు నీకు యజమానిగా, నీ అంత తెలివిమంతుడు నాకు పనివాడుగా దొరకడం—ఇద్దరి అదృష్టం. ఇక, ఇంటికి పోదాం పద!" అన్నాడు.






విష్ణువు జయవిజయులతో, "మహా మునుల శాపం మీరరానిది. నా పట్ల మిత్ర భావంతో ఏడు జన్మల్లో తరించి వస్తారా? లేక నన్ను ద్వేషిస్తూ నాకు శత్రువులై మూడు జన్మల్లో నాచేత అంతమొంది యిక్కడికి వస్తారా?" అని అడిగాడు.

జయవిజయులు విష్ణు సన్నిధానాన్ని త్వరగా చేరుకోడానికి మూడు జన్మలే కోరుకున్నారు.

అప్పుడు సనకసనందనాది మునులు జయ విజయుల్ని మెచ్చుకుంటూ విష్ణువుతో, "రాగద్వేషాలు రెండూ నీకు సమానమనీ, నిన్ను ద్వేషించేవారు మరింత త్వరగా నీకు దగ్గరవుతారనీ యిప్పుడు తెలుసుకున్నాం! నీ ద్వారపాలకులను శపించిన మా తొందరపాటు తనానికి సిగ్గు పడుతున్నాం, మమ్మల్ని మన్నించు!" అని చెప్పి, లక్ష్మీనారాయణులను అనేక విధాల మనసార స్తుతిస్తూ సేవించి వెళ్ళారు.

జయవిజయులు కశ్యపప్రజాపతి భార్య దితి కడుపున హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడుగా పుట్టారు.

అన్నదమ్ములు గొప్ప పరాక్రమవంతులై తపస్సులు చేసి బ్రహ్మను మెప్పించి వరాలు పొందారు. విష్ణువుపై కత్తికట్టి విజృంభించారు.

హిరణ్యకశిపుడు రాక్షసులకు రాజై, విష్ణువును ఎదుర్కొని సాధించడానికి కంకణం కట్టుకున్నాడు.



హిరణ్యాక్షుడు విష్ణువును కవ్వించే ఘోర కృత్యాలు చేసిచేసి, భూమిని దొర్లించుకుపోయి రసాతల సముద్రంలోకి తోశాడు. భూమి రసాతలం అడుగున మునిగిపోయింది. భూదేవి విష్ణువును తలంచి తన్ను ఉద్ధరించమని మొర పెట్టింది.

విష్ణువు భూదేవి మొర ఆలకించి దశావతారాల్లో మూడవది అయిన వరాహావతారాన్ని ఎత్తాడు.

బ్రహ్మ హోమం చేస్తూండగా యజ్ఞకుండం నుంచి తెల్లని కాంతితో ఒక నలుసు వెలువడింది. ఆ నలుసు పెద్దదై అడవి పందిగా రూపొందింది. ఆ ఏదు పందిని విష్ణువు అవతారంగా ఎంచి బ్రహ్మాది దేవతలు యజ్ఞవరాహంగా, శ్వేత వరాహంగా, ఆదివరాహంగా కీర్తిస్తూ స్తుతించారు.

యజ్ఞవరాహము అలా అలా పెరిగి, బ్రహ్మాండమైన ఆకృతి పొందింది; బలిష్ఠమైన కాళ్ళతో, ఉక్కుకవచం లాంటి పై చర్మంతో, వజ్రాల్లాంటి పొడవైన వాడి కోరకొమ్ములతో, ఎర్రనికాంతి ప్రసరించే కన్నులతో, మెడ నుంచి తోకవరకూ నిక్కబొడుచుకొని బంగారంలా మెరుస్తున్న వెంట్రుకల జూలుతో, విశ్వమంతా ఘూర్ణిల్లేలాగ వరాహము హుంకారధ్వనులు చేసింది. యజ్ఞవరాహం ముట్టెపై ఖడ్గంలాంటి కొమ్ము ధగధగా మెరుస్తున్నది.

వరాహావతారం మెరుపు వేగంతో రసాతలానికి పరిగెత్తింది. ఆ వేగానికి దిక్కులు అదిరాయి, ప్రళయవాయువులు వీచాయి.

రసాతల సముద్రంలోకి చొచ్చుకొని వెళ్ళి, అడుగున మునిగి ఉన్న భూమిని కొమ్ముతో గుచ్చి యజ్ఞవరాహము మీదకు ఎత్తింది.

అదే సమయంలో హిరణ్యాక్షుడు వరుణుడిపై దాడిచేసి పోరాటానికి పిలిచాడు.

వరుణుడు, "వీరాధి వీరుడివైన నీవు పోరాడవలసినది రసాతలం నుండి భూమిని ఉద్ధరిస్తున్న యజ్ఞవరాహంతో!" అని అన్నాడు. హిరణ్యాక్షుడు హుటాహుటిని వెళ్ళి యజ్ఞ వరాహావతారాన్ని ఢీకొన్నాడు.

వరాహరూప విష్ణువుతో హిరణ్యాక్షుడు గొప్ప పరాక్రమంతో పోరుతూ గదతో విష్ణువు గదను తృళ్ళగొట్టి నిల్చున్నాడు. విష్ణువు అతని యుద్ధనీతిని మెచ్చుకొని తిరిగి గదను ధరించాక, యిరువురికీ సంగ్రామం ఘోరంగా సాగింది. చివరకు వరాహావతారం తన కొమ్ముతో హిరణ్యాక్షుణ్ణి పొడిచి చంపింది.



వరాహావతారుడైన విష్ణువును భూదేవి వరించింది. వరాహమూర్తి భూదేవిని సందిట చేర్చుకొని తొడపై కూర్చుండబెట్టుకున్నాడు. బ్రహ్మాది దేవతలు పూల వాన కురిపిస్తూ, జగపతిగా విష్ణువును అనేక విధాలుగా స్తోత్రం చేశారు.

పందిరూపంతో తన తమ్ముణ్ణి చంపిన విష్ణువుపై పగ సాధించడానికి తీవ్ర సంకల్పంతో, ముందు బ్రహ్మవల్ల వరాలు పొందడానికి హిరణ్యకశిపుడు తపస్సుకు వెళ్ళాడు. అప్పుడు అతని భార్య లీలావతి గర్భవతిగా ఉన్నది.

ఆమె గర్భవాసాన్ని హతమార్చడానికి ఇంద్రుడు మాయోపాయంతో లీలావతిని చెరగొని, ఆకాశమార్గాన పోతూండగా, నారదుడు ఎదురై, "దేవేంద్రా! ఎంత పనికి ఒడిగట్టావు! నీ ప్రయత్నాన్ని విరమించు. సర్వకాల సర్వావస్థలలో హిరణ్యకశిపుడు పగతో విష్ణువు గురించే తలంచుతూండే వాడవడంవల్ల, లీలావతి గర్భస్థుడైన శిశువుకు ఆ విష్ణుచింతన సంక్రమించి, పగ భక్తిగా అతనిలో రూపాంతరం పొందింది. ఇదే విష్ణుమాయ అయిన ప్రకృతి విశేషాల్లో ఒకటి. లీలావతి గొప్ప విష్ణుభక్తుణ్ణి కనబోతూన్నది. అంచేత లీలావతిని విడిచిపుచ్చి, నీ దారిన నువ్వు వెళ్ళు!" అని చెప్పి లీలావతిని తన ఆశ్రమానికి తీసుకెళ్ళాడు.



ఆశ్రమంలో నారదుడు వేదాంత విషయాలనూ, విష్ణు గుణగణాలను వర్ణిస్తూన్నప్పుడు, లీలావతి గర్భంలో ఉన్న బిడ్డ ఆసక్తితో వింటూ, ఊఁ కొడుతూండేవాడు. లీలావతి కుమారుణ్ణి ప్రసవించింది.

హిరణ్యకశిపుడు ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మను మెప్పించాడు. భూమ్మీద గాని, ఆకాశంలోగాని, రాత్రిగాని పగలు గాని, ఇంటగాని, బయటగాని, మృగంచేత గాని మనిషిచేతగాని, దేవతలు మొదలైన వారివలన గాని, ప్రాణమున్న దానిచేత గాని లేనిదానిచేతగాని, సృష్టిలో ఉన్న ఏ రూపంచేత గాని, యింకా ఎన్నో విధాలుగా తనకు చావులేని వరాల్ని కోరాడు; బ్రహ్మ అతను కోరిన వరాలన్నిటినీ యిచ్చాడు.

వరాలను పొందిన విజయగర్వంతో హిరణ్యకశిపుడు వస్తూండగా, నారదుడి వలన జరిగినది విని, నారదాశ్రమానికి వచ్చి, కుమారుడి పేరు ప్రహ్లాదుడు అని నామకరణ మహోత్సవం జరిగాక, భార్యనూ, కుమారుణ్ణీ తన రాజధానికి తీసుకువెళ్ళాడు.

ఇంద్రుడిపై ప్రతీకారంగా హిరణ్యకశిపుడు స్వర్గం మీదకు దండయాత్ర చేసి స్వర్గసింహాసనం ఆక్రమించాడు. దిక్కులన్నిటినీ జయించి, అష్ట దిక్పాలకుల్ని తన అదుపాజ్ఞల్లో పెట్టుకున్నాడు. దేవతల్ని పశువుల్ని బాదినట్లుగా బాదాడు. శచీదేవిని అవమానించబోతే లీలావతి అడ్డుకొంది.

హిరణ్యకశిపుడు విజృంభించి మునుల ఆశ్రమాల్ని తగలబెట్టించాడు. విష్ణు విశ్వాసకుల్ని చిత్రవధలు చేయించాడు. విష్ణువును ఎదుర్కోవడమే అతని ధ్యేయం. విష్ణువును కవ్వించడానికి చేయవలసినవన్నీ చేశాడు. అయినా విష్ణువు అతనికి తారసపడలేదు. వైకుంఠానికి దాడి వెళ్ళాడు. అక్కడా విష్ణువు అతనికి కనపడలేదు.

"నాకు భయపడి అదృశ్యంగా దాగున్నాడు, పిరికిపంద!" అని హిరణ్యకశిపుడు తిరిగి వచ్చాడు.

ప్రహ్లాదుడు దినదిన ప్రవర్ధమానంగా ఎల్లప్పుడూ విష్ణుస్మరణ చేస్తూ పెరుగుతూన్నాడు. తనకు అటువంటి కులద్రోహి ఎందుకు పుట్టాలి! అని హిరణ్యకశిపుడు చింతించి, గురుపుత్రులైన చండామార్కులకు ప్రహ్లాదుణ్ణి అప్పగించి, విద్యాబుద్ధులు నేర్పమన్నాడు.

ప్రహ్లాదుడు గురుకులంలో హరిధ్యానంతోనే చదువంతా పూర్తి చేశాడు. తోటి బాలురకు విష్ణుభక్తి ప్రబోధించేసి మోక్షమార్గంపట్ల ఆసక్తికలవారిగా చేశాడు.

చండామార్కులు ప్రహ్లాదుణ్ణి తండ్రి దగ్గిరికి తీసుకెళ్ళారు. హిరణ్యకశిపుడు కుమారుణ్ణి తొడపై కూర్చుండబెట్టుకొని, "నాయనా! నువ్వు నేర్చిన విద్య తెలిసేలాగ మంచి పద్యం ఒకటి చెప్పు!" అన్నాడు.

ప్రహ్లాదుడు, "తండ్రీ! గురువులు చెప్పిన చదువంతా క్షుణ్ణంగా నేర్చాను. చదువులన్నిటి కంటె గొప్పదైన చదువు విష్ణువునందు మనసు నిల్పడం ఒక్కటే! విష్ణువును స్మరించే జన్మే జన్మ!" అన్నాడు.

హిరణ్యకశిపుడు కుమారుణ్ణి క్రిందకు తోసి పట్టరాని ఆగ్రహంతో చండామార్కులతో, "ఇదా మీరు నేర్పిన చదువు?" అన్నాడు.



చండామార్కులిద్దరూ గజగజలాడుతూ, "మా తప్పేమీ లేదు, మహాప్రభూ! మాపై ఆగ్రహించకు!" అని వేడుకుంటూ, గురుకులంలో ప్రహ్లాదుడే విధంగా ప్రవర్తించినదీ వివరంగా విన్నవించుకున్నారు.

హిరణ్యకశిపుడు కొడుకుతో, "విష్ణువు పందిగా నీ పినతండ్రిని చంపాడు. మన రాక్షస కులానికి పరమశత్రువు. నీవు విష్ణువును పొగడ్డం క్షమించరాని కులద్రోహం. విష్ణుభక్తి మాను, వాణ్ణి మర్చిపో!" అన్నాడు.



"దానవేశ్వరుడవైన నీవు అన్నివిధాలా నన్ను శాశింపతగినవాడివే! కాని ఇనుము ముక్క అయస్కాంతాన్ని ఏ విధంగా అంటుకుంటుందో, అలాగే నా మనస్సు విష్ణువు పైనే లగ్నమై ఉన్నది; మందార పువ్వు మకరందాన్ని తుమ్మెద ఎలాగ విడిచిపెట్టలేదో, అలాగే విష్ణువును మర్చి పోవడం నా వశంలో లేదు. నాలో జీవము ఉన్నంతవరకూ విష్ణుచింతన పోదు, ఆ జీవము కూడా విష్ణువే!" అన్నాడు వినయంగా.

ముక్కుపచ్చలారని బాలుడైన ప్రహ్లాదుడి మాటలకు విస్తుపోతూ హిరణ్యకశిపుడు కోపంతో అగ్నిలా ప్రజ్వరిల్లి, "అయితే నీవు చావక తప్పదు, ఆహార పానాలు లేకుండా మాడి చావు!" అంటూ ప్రహ్లాదుణ్ణి వెల్తురు చొరవని కారాగారంలో పెట్టించాడు.

పుత్రప్రేమతో లీలావతి తల్లడిల్లి పోయింది. రోజులు గడుస్తున్నాయి.

లీలావతి శోకం చూడలేక హిరణ్యకశిపుడు కారాగారం తెరిపించి, తన్మయుడై విష్ణుసంకీర్తన చేస్తూ నవనవలాడుతూన్న ప్రహ్లాదుణ్ణి చూసి, చాలా రోజులుగా అన్నపానాలు లేకుండా ఎలా బతికి ఉన్నాడా అని ఆశ్చర్యపడుతూనే, పట్టరాని ఆగ్రహంతో ప్రహ్లాదుణ్ణి ఏనుగులచేత మట్టించమన్నాడు.

ఏనుగులు సింహాన్ని చూసినట్లు బెదిరాయి. మావటివాళ్లు పొడిచి నడిపించితే, అతనిమీద నుంచి వెళ్ళాయిగాని, అతనికే అపాయమూ కలగలేదు.

పాములచేత కరిపించబోతే, కాటు వేయకుండా ముద్దాడి, పడగలు విప్పి గొడుగులుపట్టి ఆడాయి.

కొండశిఖరం నుంచి తోయించాడు, మంటల్లో వేయించాడు, సముద్రంలో పడవేయించాడు, కాలకూట విషం త్రాగించాడు. ఎన్నిచేసినా, ప్రహ్లాదుడు సురక్షితంగా ఉండటం చూసి, హిరణ్యకశిపుడు, "నువ్వు చావకున్నా వెందు

చేత? ఆ రహస్యమేమిటో చెప్పు!'' అని అడిగాడు.

ప్రహ్లాదుడు నవ్వుతూ, ''ఇందులో రహస్యం ఏదీలేదు; ఏనుగుల్లో, పాముల్లో, రాళ్ళలో, అగ్నిలో, సముద్రాల్లో, విషంలో అన్నిట్లో, నీలో, నాలో ఉన్నది విష్ణువే అన్న సత్యాన్ని తెలుసుకోలేకపోతున్నావు! నన్ను చంపాలనుకుంటున్నదీ, నేను బతుకుతూన్నదీ, అతని లీలావినోదమే, నాన్నా!'' అన్నాడు.

ఆ మాటలకు హిరణ్యకశిపుడు కోపావేశంతో ప్రహ్లాదుణ్ణి బరబరా ఈడ్చుకు వెళ్ళి సభామంటపం మధ్య నిలబెట్టి, తన గదను తీసి పట్టుకొన్నాడు. లీలావతి మూర్ఛపోయింది. చుట్టూరా రాక్షస ప్రముఖులు నిర్విణ్ణులై బొమ్మల్లా నిలబడి చూస్తున్నారు.

సభామంటపానికి ఎదురుగా లోహ నిర్మితమైన పెద్ద జయస్తంభం ఉంది. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడికి ఆ స్తంభాన్ని చూపుతూ ''ఓరీ కులద్రోహీ! అది, నా విజయస్తంభం! నా తమ్ముణ్ణి చంపిన విష్ణువుతో పోరాడి, నీ ముందే సంహరించి పగతీర్చుకుంటాను, అందులో ఉన్నాడా?'' అనడిగాడు.

''ఆ సందేహమే వద్దు. అంతటా ఉన్నాడు, అందులోనూ ఉన్నాడు,'' అన్నాడు ప్రహ్లాదుడు.

హిరణ్యకశిపుడు చరచరా వెళ్ళి గదతో స్తంభాన్ని కొట్టాడు. ప్రళయధ్వనితో భూనభోంతరాలు దద్దరిల్లాయి, పొగలమేఘాలు అంతటా విరజిమ్ముకున్నాయి. స్తంభం రెండుగా చీలిపోతూండగా వెలువడిన మిరుమిట్లుగొలిపే మెరుపుల మధ్య దశావతారాల్లో నాలుగోది అయిన నరసింహావతారంగా విష్ణువు ఆవిర్భవించాడు. సింహం తల, మనిషి శరీరము, చేతులకు సింహం గోళ్ళతో సృష్టిలో లేని రూపం గల నరసింహమూర్తి ప్రళయభీకరంగా గర్జించాడు. పాంచజన్యశంఖధ్వని వినిపించింది. సుదర్శనచక్రం అతని చుట్టూ తిరుగుతూ కనిపించింది.





# ఆరితేరిన దొంగ

రుమానియా రాజధాని నగరంలో ఒక ఆరితేరిన దొంగ ఉండేవాడు. అతను ఒకనాడు ఒక పల్లెటూరికి పోతూ దారిలో మరొక దొంగను కలుసుకున్నాడు. ఆ పల్లెటూరి దొంగ పట్టణంలో తన వృత్తి కొనసాగింతామని వస్తున్నాడు. ఇద్దరూ మాట్లాడుకోవటంలో వారిది ఒకే వృత్తి అని స్పష్టమయింది.

పట్టణందొంగ పల్లెటూరిదొంగతో, "నీ నేర్పు చూద్దాం. ఆ చెట్టు మీది కాకిగూడు నుంచి, కాకికి తెలీకుండా దాని గుడ్లు దొంగిలించుకురా," అన్నాడు. పల్లెటూరి దొంగ చెట్టెక్కి, కాకిగూడు చేరి, పొదుగుతున్న కాకికి తెలియరాకుండా దాని గుడ్లు కాజేసి, జేబులో వేసుకుని చెట్టు దిగి వచ్చాడు. కాని వాడు కిందికి దిగివచ్చి జేబులో చూసుకుంటే గుడ్లు లేవు. పట్టణం దొంగ వాటిని తన చేతిలో చూపిస్తూ, "ఫరవాలేదు. నువు నేర్పుగల దొంగవే! దొంగతనాలలో నాకు కుడిభుజంగా ఉన్నావంటే నీకు వాటా ఇస్తాను," అన్నాడు. ఇందుకు పల్లెటూరి దొంగ ఒప్పుకున్నాడు.

ఇద్దరూ కలిసి ఆ రాత్రి రాజుగారి ఖజానా దోచడానికి నిశ్చయించారు. చీకటి పడగానే వాళ్ళు ఒక పక్కనుంచి రాజుగారి భవనం పైకప్పు మీదికి ఎక్కి, కప్పులో వుండే అద్దపు కిటికీలగుండా ఒక్కొక్క గదే చూస్తూ, చివరకు ఖజానా కొట్టు తెలుసుకున్నారు. అందులో పీపాల నిండా బంగారపు నాణాలున్నాయి.

పెద్ద దొంగ చిన్న దొంగను తాడు సహాయంతో అద్దపు కిటికీగుండా ఖజానా కొట్టులోకి దించాడు. చిన్న దొంగ సంచీ నిండా బంగారు నాణాలు నింపుకుని తిరిగి కప్పు చేరుకున్నాడు. తరవాత ఇద్దరూ రాజభవనం దిగి వెళ్ళిపోయారు.

రుమానియా జానపద కథ



కొట్టులో పొగపెట్టి, పొగ ఎటుగా బయటికి వస్తుందో గమనించండి. కన్నం ఎక్కడ వున్నదీ ఇట్టే తెలిసిపోతుంది,'' అన్నాడు ముసలి దొంగ.

రాజు అలాగే చేసేసరికి, కప్పులోని అద్దం కిటికీగుండా పొగ పైకి వచ్చింది. రాజు ఈ మాట చెప్పేసరికి ముసలి దొంగ, "ఆ దొంగ మళ్ళీ వచ్చి తీరుతాడు. ఆ కిటికీ అద్దాన్ని తాపడం చేయించకుండా అలాగే ఉండనిచ్చి, కిటికీ దిగువన పెద్ద పీపాలో చిక్కని బెల్లపు పాకం పోసి ఉంచండి. దొంగ తిన్నగా అందులోకి దిగబడి మీకు చిక్కిపోతాడు,'' అన్నాడు.

ముసలి దొంగ అన్నట్టుగానే జరిగింది. దొంగలిద్దరూ కూడబలుక్కుని, "ఆ ఖజానాలో ఇంకా చాలా బంగారం ఉన్నది. రాజుకు దొంగతనంగురించి తెలిసే లోపుగా మనం మరికొంత కొల్లగొట్టటం మంచిది,'' అనుకుని, మరుసటి రాత్రి మళ్ళీ వచ్చారు.

చిన్న దొంగ తాడు మీది నుంచి దిగి తిన్నగా బెల్లపు పాకంలో దిగబడ్డాడు.

"అన్నా, మోసం జరిగింది. నేను కదలలేకుండా ఎందులోనో కూరుకుపోయాను. నన్ను పైకి లాగటం సాధ్యం కాదు. నేను ప్రాణాలతో దొరకకుండా, ఇంత విషం ఇచ్చి నువు తప్పించుకుపో!'' అన్నాడు వాడు.

మర్నాడు పూర్వాహ్నంవేళ రాజుగారు రోజూలాగే తన ఖజానా చూసుకోవటానికి వచ్చి, "ఈ గదిలోకి ఎవరు వచ్చారు?'' అని అడిగాడు.

"ఎవరూ రాలేదు, మహారాజా,'' అన్నాడు కాపలావాడు.

రాజు ఖజానానుంచి కారాగృహానికి వెళ్ళి, అక్కడ ఖైదు చేసి వున్న ఒక ముసలి దొంగతో, "ఎవరో ఖజానాలో ప్రవేశించి రెండు వేల చిల్లర బంగారు నాణాలు కాజేసుకుపోయారు. గోడలో ఎక్కడా కన్నంలేదు,'' అన్నాడు.

"కన్నం ఉండేఉంటుంది, మహారాజా, మీరు కనుక్కోలేదు, అంతే. ఖజానా

"భయంలేదు, తమ్ముడూ, భయపడకు. నా దగ్గిర, చచ్చినట్టుగా కనబడేటట్టు చేసే మందున్నది. అది మింగు, రేపు నేను వచ్చి నిన్ను రక్షిస్తాను," అని పెద్ద దొంగ, తాడు మీదుగా దిగి వచ్చి చిన్న దొంగకు ఏదో మందిచ్చి, వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయమే రాజు ఖజానా కొట్టుకువచ్చి, పీపాలో చిక్కుకుపోయిన దొంగను చూసి, "ఆహా! దొంగ దొరికాడు! వెధవా, నీ అంతు తేలుస్తానుండు," అన్నాడు. కాని దొంగ చచ్చి ఉండటం గమనించగానే రాజుగారి ఉత్సాహం చల్లారింది. ఆయన ఖైదుకు వెళ్ళి ముసలి దొంగతో సంప్రదించాడు.

"మహారాజా, వీళ్ళెవరో చాలా తెలివైన దొంగలు!" అన్నాడు ముసలిదొంగ.

"దొంగలా? వీడుగాక ఇంకోడున్నాడంటావా?" అన్నాడు రాజు తెల్లబోయి.

"ఇంకొకడు లేకపోతే వీడెలా చచ్చాడంటారు? ఆత్మహత్య చేసుకోలేడు గదా? బెల్లపు పాకంలో కూరుకుపోయినంత మాత్రాన ప్రాణాలు పోవు కదా? అయినా ఆ రెండోవాణ్ణి పట్టేమార్గం ఉన్నది లెండి. వీడి శవం కోసం వాడు తప్పక వస్తాడు. నగరద్వారం బయట వీడి శవాన్ని ఒక కుర్చీలో పెట్టి, దానికి భటులను కావలి పెట్టండి," అన్నాడు ముసలి దొంగ.



ముసలి దొంగ చెప్పినట్టే, పెద్ద దొంగ తన మిత్రుణ్ణి కాపాడే ప్రయత్నాలు ప్రారంభించాడు. వాడు ఒక తెల్లగుర్రాన్నీ, బండినీ, నాలుగు జాడీల సారానూ కొన్నాడు. తరవాత అతను ముసలివేషం వేసుకుని, నగర ద్వారానికి యాభై గజాల దూరంలో బండిని పక్కకు ఒరగవేసి, "అయ్యో నా బండి పడిపోయింది. సారా జాడీలు పడిపోయాయి. రక్షించండి!" అని కేకలు పెట్టాడు.

చిన్నదొంగకు కాపలా వున్న భటులు "ఒరే, ముసలాడా! మాకు ఒక సారా జాడీ ఇస్తే, నీ బండి సరిచేస్తాం," అన్నారు.

"నేను కాదన్నానా, బాబుల్లారా? ఒక జాడీ ఇస్తాను," అన్నాడు పెద్దదొంగ.



"వాడు తప్పక నా గుర్రాన్ని ఎత్తుకుపోతాడు. దొంగను నమ్మరాదు," అన్నాడు పెద్దదొంగ.

"నోరు మూసుకో, ముసలాడా! వాడు నీ గుర్రాన్ని కాజేస్తే నేను నీకు గుర్రం ఖరీదిస్తాను. సరేనా?" అన్నాడు సర్దారు.

తరవాత భటులు ఒక్కొక్కరే నిద్ర మత్తులో ఒళ్ళు తెలియకుండా పడిపోయారు. వెంటనే పెద్దదొంగ చిన్న దొంగను సమీపించి, అతని నోట్లో ఏదో ద్రావకం పోశాడు. కొద్దిసేపటికల్లా చిన్న దొంగ కదిలి, కళ్ళు తెరిచాడు.

"చూడు తమ్ముడూ, వీళ్ళు ఎంతోసేపు మత్తులో వుండరు. నువు గుర్రాన్ని ఎక్కి మనచోటికి వెళ్ళిపో. ఉదయం కాగానే నేను వచ్చి కలుసుకుంటాను," అన్నాడు పెద్దదొంగ చిన్నదొంగతో. చిన్న దొంగ గుర్రాన్ని ఎక్కి బయలుదేరగానే పెద్దదొంగ యథాస్థానానికి వచ్చి, నిద్ర పోతున్నట్టు నటించాడు.

తరవాత కొంతసేపటికి భటులు ఒక్కొక్కరికీ స్పృహ వచ్చింది. చచ్చిపోయిన దొంగతోబాటు గుర్రం కూడా మాయం కావటం చూసి వాళ్ళు అదిరి పడ్డారు. సర్దారు కళ్లు నులుపుకుని మళ్ళీ చూసి, "ముసలాడు అన్నంతా అయిందే!" అన్నాడు.

భటులు బండిని సరిగా నిలబెట్టి, ఒక సారాజాడీ తీసుకుని, వంతు ప్రకారం తాగసాగారు. దొంగ ఆ సారాలో నిద్ర మత్తుమందు కలిపిన సంగతి వాళ్ళెరగరు. భటులకు నిద్రమత్తు వస్తున్న సమయంలో పెద్దదొంగ చిన్నదొంగను చూపి, "సర్దారుగారూ, ఇతగాడెవడు?" అన్నాడు.

"వాడొక దొంగలే" అన్నాడు సర్దారు.

"అయ్యో, వీడు నా గుర్రాన్ని ఎత్తుకు పారిపోతాడేమో!" అన్నాడు పెద్దదొంగ.

"ముసలాడా, నీకు మతిపోయిందా ఏం? వాడు చచ్చాడు, కనబడటం లేదూ?" అన్నాడు సర్దారు.

అతను లేచి వెళ్ళి నిద్ర నటిస్తున్న పెద్ద దొంగను లేపి, "నా కంతా అయోమయంగా వుంది. ఎలా అన్నావోగాని నువు అన్నంతా అయింది. దొంగా లేడు, గుర్రమూ లేదు. రాజుగారికి ఇక్కడ జరిగినది తెలిస్తే తోలువలిచేస్తారు. నీ గుర్రానికి రెట్టింపు ఖరీదిచ్చుకుంటాను. ఇక్కడ జరిగినది మాత్రం బయట పెట్టకు," అని ప్రాధేయపడ్డాడు.

పెద్దదొంగ తాను వచ్చిన పని పూర్తి చేసుకోవటమే గాక అయిదు వందల నాణాలు కూడా సంపాదించుకుని వెళ్ళిపోయాడు.

రాజు జరిగిన సంగతి చెప్పేసరికి ముసలిదొంగ, "వాడెవడో ఆరితేరినవాడని నేను ముందే చెప్పలేదా? పెద్ద బహుమానం ఇస్తానని ప్రకటన చేస్తేగాని వాడు తమ కళ్ళ పడడు," అన్నాడు.

రాజుకు కూడా ఈ పాటికి దొంగ మీద చాలా ఆదరం ఏర్పడింది. ఆయన దొంగకు పెద్ద బహుమానం ప్రకటించాడు.

పెద్దదొంగ వచ్చి, "మహారాజా, నేనే దొంగను. తాము ఇచ్చే బహుమానం అందుకుందామని వచ్చాను," అన్నాడు వినయంగా.

"నువే దొంగవని నాకెట్లా రుజువు?" అని రాజు దొంగను అడిగాడు.

దొంగ దూరంగా ఒక ఎద్దును తోలుకు పోతున్నవాణ్ణి చూపించి, "ఆ ఎద్దును దొంగిలించుకు రాగలను," అన్నాడు. ఆ ఎద్దును తోలుకుపోతున్నవాడు చిన్న దొంగే.

"ఆ ఎద్దును తెస్తే నేను నీ మాట నమ్ముతాను," అన్నాడు రాజు.

పెద్దదొంగ వెళ్ళి ఎద్దును తోలుకు పోయేవాడితో ఏదో అనటమూ, ఎద్దును తోలుకుపోయేవాడు నెత్తీనోరూ బాదుకుని పారిపోవటమూ చూసి, రాజు తృప్తి పడ్డాడు. ఆయన దొంగకు అంతులేని బహుమానం ఇచ్చి పంపేశాడు. దాన్ని దొంగలిద్దరూ పంచుకుని సుఖంగా జీవించారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 జూలై నెల సంచికలో ప్రకటింపబడును







Chandrapal Singh K. S. Vijayaker

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మే నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు) ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వెమలి కాని వెమలిని

రెండవ ఫోటో : వేనే తోటకు మాలిని

పంపినవారు : గుత్తుల శ్యామల, బి/బి 220, కర్నూలు-518002

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

రీటా మీ జుట్టు పెంపుదల



జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, చల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.




# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును

స్త్రీలూ పురుషులూ వాడదగ్గది

ఇప్పుడు సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది.

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26

# అమిత్ లెఖ్ఖలు బాగా చేస్తాడు అలాగే అతని జామెట్రీ బాక్స్ కూడా.




## అతనూ, అతని జామెట్రీ బాక్స్ కలిసిపోయిన రెండేళ్ళుగా పనిచేస్తున్నాయి.

కెమెల్ జామెట్రీ సెట్‌లు చిరకాలం మన్నేలా రూపొందించబడింది. అవి గట్టివి, ఎలా వాడినా పాడయి పోకుండా నిలిచేవి.

అవి ఎంతో నిశితమైనవి కూడా. ఫలితంగా లెఖ్ఖల్లో విజయానికి హెచ్చు తగ్గులేకపోవడం ముఖ్యమని మీ పిల్లలు నేర్చుకుంటారు.

వీటికి పెట్టాల్సిన ధర మరి కొంచెం ఎక్కువే. అయితేనేం, ఒక్కొక్కప్పుడు పొదుపు చేసేందుకు కూడా కొంచెం ఎక్కువ ధర పెట్టాల్సివస్తూ ఉంటుంది. కెమెల్ చిరకాలం నిలిచే వస్తువుకు, ఎంతో కాలం ఉండేలా ఆధారం.

**కెమెల్** జామెట్రీ బాక్స్






కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్
బొంబాయి-400 059 (ఇండియా)

VISION/TEL/811

**Results of Chandamama—Camlin Colouring Contest No. 28 (Telugu)**

*1st Prize:* R. V. Kumar Reddy, Visakhapatnam-530 035. *2nd Prize:* Ravnga Reddy, Saroor Nagar-500 035. M. Kumar Viswa Sampath, Vijayawada-520 007. Nimmana Raju, Talpukur. *3rd Prize:* G. V. S. V. Ramana, Kanchara Pet. K. Vinodkumar, Elyry. T. Venkatesh, Hyderabad-4. G. Ramesh, Tallaneeru. Dutta Usha Rani, Ramachandrapuram-500 039. S. Ravi Kumar, Srikakulam-532 001. K. Krishna, Vijayawada-520 002. P. N. G. Suresh Kumar, Rayagada. Madhavi, Hyderabad-500 029. Gireesh Vasant Chiddarsar, Rashtriya.




**We're all in it together for the fun of it, for the taste of it!**

CAMPA ORANGE FLAVOUR – IT'S THE FLAVOUR OF FUN!

OBM/5361

# రాము-శ్యాము

## లక్కీ నంబరు 50






















వెండి చారలుంటేనే కొనండి
నకిలీవాటి మోసంలో పడకండి.

everest/83/PP/40 tl